ఓం.

శ్రీ గురుభ్యో నమః

# ఆత్మ పంచాంగము



ఇది.

శ్రీమద్దానానదాసురాలును

యలమంచిలి గ్రామ నివాసురాలును

## గౌడు జోగమాంబగారిచే

రచియింపబడి ప్రకటింపబడియె.

రెండవ కూర్పు 1000 ప్రతులు

కాకినాడ:

మాస్టర్ మన్ ముద్రాశాలయంను

ముద్రింపఁబడియె.

1952

వెల రు 1-0-0 ౦-౧౨-౦

# పీఠిక

ఓమిత్రులారా! లోకంబున భక్తిహీనులై బ్రతుకుట కన్న మరణించుట శ్రేయోదాయకమని తోచుచున్నది గాన భక్తి యెటువంటిదనగా మోక్షసాధనసామగ్ర్యాంభక్తి రేవ గరీయసి అనుట దెలసికూడా భక్తిని బడయజాలకున్నాము. అట్టిభక్తి లేనియడల నెట్టికార్యమైనను సిద్ధించదు. రెండవది శ్లో॥ వివేకినో విరక్తస్య శమాదిగుణ శాలినః । ముముక్షురే వహిబ్రహ్మ । జిజ్ఞాసా యోగ్యతా మతః॥ యనునట్లు వివేకాది సంపత్తిలేనివారు బ్రహ్మవిచారణ కర్హులుకారని చెప్పుచున్నారు గాన మున్ముందు సాధన సంపాదించవలెను. అట్టి సాధన సజ్జనసంగమువలననే లభించును గాని తద్వినా అలవడదు. గాని అట్టి సత్సంగమైనను సులభముగా పొందబడదు. ఎట్లన శ్లో॥ విరక్తి హీనశ్య కుతః ప్రబోధా విరక్తి హీనస్య। కుతః ప్రయోగః। విరక్తి హీనస్య కుతఃస్య। మోక్షా తస్మాద్విరక్తియె సమస్తలాభః॥ యనునట్లు వివేక విరక్తులతో గూడినవారికే సజ్జనసాంగత్యముకూడా లభ్యమౌను గాని లేనియడల యెట్టిసుఖమును పొందజాలముగాన రేపనునది యముని దినమని నమ్మి ఇప్పుడే ఈ తక్షణమే సాధన సామగ్రిని గూర్చవలెను. ఇట్లు చెప్పుటలో కొందరి యభిప్రాయము యెట్లుండుననగా పురుషప్రయత్నం వ్యర్థమనియు సర్వం

ద్వైవాధీనమనియు తలంచెదరు. కాని అట్లుకాదు ఇందు కుదా హారణ శ్లో॥ పూర్వజన్మ కృతం కర్మ। తద్దైవమితి కధ్యతే॥ యనునట్లు తనకు వినాగా ద్దైవము లేదనియు పూర్వజన్మలో చేసిన ఖర్మయే ద్దైవరూపముగా ఈజన్మమున అనుభవముకు వచ్చుచున్నదనియు శాస్త్రం చెప్పుచున్నది. తరువాత ముక్తికోపనిషత్తులో రామునిచే బోధింపబడిన ఆంజనేయుడే మనలకు ప్రమాణం యెట్లన స్రుతి॥ ప్రయోజనం భవతి తత్పురుష ప్రయత్నసా ధ్యోభవతి। యధా పుత్రకామేష్టినా పుత్రం। వాణిజ్యాది నావిత్తం। జ్యోతిష్టోమేనా స్వర్గం। తదా పురుషప్రయ్య సాధ్య। వేదాంత శ్రవణాది జనిత సమాధినా। జీవన్ముక్త్యాదిలాభో భవతి। సర్వవాస నాక్షయా తల్లాభః। అత్రశ్లోకః॥ వుచ్ఛాస్త్రం శాస్త్రితం చేతిపౌరుషం। ద్వివిధం స్రుతం। తత్రోచ్ఛాస్త్రం మనార్ధాయ। పరమార్ధాయ శాస్త్రి తం॥ ఇట్లు సమస్తవేదశాస్త్రములు బోధించుచుండ వాటిని నమ్మక పెడదారి పట్టువారికి నరకంద్రువం గాన బుద్ధిమంతు లగువారు ఈశాస్త్రమునందు నమ్మిక కలిగియుందురుగాక అదియునుగాక అట్టిపెడవాదమును సలుపువార్ని చేరరాదని కూడ ఆశాస్త్రమే చెప్పుచున్నది. యెట్లన శు)॥ కేచి దజ్ఞా నతోనష్టా కేచన్నష్టా ప్రమాదతః। కేచజ్ఞాన వలోపేనా। కేచీర్నష్టయి ర్వినాసితః॥ యనునట్లు తెలిసి చెడువారు కొం దరు, తెలియక చెడువారు కొందరు. తెలిసిన్ని ప్రమాదముచే చెడువారు కొందరు. తెలియకున్నను తెలుసునని గర్వించి

చెడువారు కొందరు. వారిని చెరిచెడువారు మరికొందరు ఇట్లనేకవిధములుగా యున్నది ప్రపంచము. గాన బుద్ధిమంతు లగువారు ఇట్లు గోతలో పడక శాస్త్రం నమ్మవలయును. ఆదియునుగాక శ్లో॥ శాస్త్రదృష్టం। గురుర్వాక్యం। త్రియా శ్యతె నిశ్చయః। త్రిద్వైవయో విజాతిన ముక్తిర్మాత్ర సంశయః॥ యనునట్లు శాస్త్రద్రుష్టికిన్ని గురువాక్యమునకున్ను తన ఆత్మనిశ్చయమునకున్ను సరిపడనలయునే కాని ఇందు ఏది లోపముగా యుండినను దానివల్ల ముమ్మాటికి ముక్తి లేదు. మిత్రులారా నాసద్గురు అనుగ్రహమున ఈస్వల్పజ్ఞాను రాలు ఈచిన్నపుస్తకమును రచియించినది. గాన ఇందుగల తప్పులను ఒప్పులనుగా భావింపుడని నా ప్రార్థనావందనములు. జనులారా ఇదివరలో వేదాంతసారసంగ్రహమను వక పుస్తకము నాయధాశక్తికొలది వ్రాసి భోధక గురురూపులగు మళయాళస్వామికి మంత్రపుష్పముగా సమర్పించితిని. ఇప్పుడు ఆత్మపంచాంగమను ఈ అద్వైతగ్రంధము కారణగురురూపిణి యగు సద్గురు జనని కూరెళ్ళ కామేశ్వరమ్మగారికి మనః ప్రీతిగా ఈగ్రంథము మంత్రపుష్పముగా సమర్పిస్తిని. గాన ఇందుగల సారవాక్యములన్నియు సద్గురుజనని కృపారస మనియు నిస్సారవాక్యము లన్నియు నాతెలివితకు పొరపాటనియు భావింపవలెను.

సోదరులారా! నాకు నిజమగు కవనశక్తి లేకున్ననూ కొందరు పెద్దలు పిన్నలూ కూడ అచ్చువేయించమని కోరుటచే నిట్లు అచ్చొత్తించినాను. కావున తప్పు పడితేమి సద్భక్తి తక్కువౌనె। చెరుకునకు వంకపోతేమి చెడునె తీపూ॥ యని గ్రహించునది.

ఇట్లు సజ్జన విధేయురాలు,

యలమంచిలి. గౌడు జోగమాంబ.



ధర్మం చరా　　　　శ్రీ గురుభ్యోనమః　　　　సత్యంవదా

# ఆత్మ పంచాంగము

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుం గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరం బ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః॥

ఓ ఆత్మ సోదరులారా! మన పూర్వీలగు సనాతన రుషులు మనల కెన్నివిధముల వుపకారములు చేయుచుండిరో యోచనచే చూడగా బహు ఆశ్చర్యకరముగా నున్నది. అది యెట్లన లౌకికులు తమ దారాపుత్రాదులకు తమరు ఆర్జించిన ధనకనక వస్తువాహనాదికముకు అనేక దస్తావేజులున్నూ, కొన్ని నోట్లున్నూ జాగ్రత్తచేసి తమ ఇంటియందుంచి కాలము చేయుచుండిరి. యెందువల్లననగా ఈ దేహముతో నదియు నసించేవే కాన అంతటితో సమాప్తి చెందుచుండిరి. తరువాత మనరుషులు అట్లుగాక దిన వార, పక్ష, మాస, సంవత్సరములుగానున్ను, అనేక పండుగ రూపములుగాను, నామధేయములు చేసి మనల యేవన్మందికి ఆబాల గోపాలంగా కంటస్తమగునట్లు చేసిరి. యెందువల్ల ననగా ఆత్మజ్ఞానం కలుగజేసి జన్మరహితముచేసెడి సంగతులు గాన అట్లు కంఠస్తం గానియెడల వాకానొక

సమయమున మర చెదవేమో యని అట్లు చేసిరి, అదంతయూ యోచనచేసి చూడగా నాబుద్ధికిట్లు గోచరమైనది. యెట్లన ముందుగా యుగముల పేర్లయందు యెట్టి గూఢమున్నదో చూడుడు.

## యుగములు

కృతయుగము అనగా సర్వజీవులయడా కృపారసుండవై యుండినయెడల ఆత్మతత్వముకు కావలసిన యుక్తి శ్రుతి అనుభవములున్ను, జ్ఞానమున్ను ముముక్షువగువానికి గోచరమగును. త్రేతయుగ మనగా త్రితరూపమగు ఈత్రిపుటీవత్తు విడచి తత్వస్వరూపమును కనుగొనుము. ద్వాపరయుగ మనగా ఆ ఆత్మ సులభముగా తెలియుటకు వీలుపడదు. ద్వాదశవర్షసుసూత్రిష గావించిన పరమాత్మవస్తువ గోచరించును. కలియుగమనగా ఖర్మరూపమగు మనసు లీనం కావలయునన్నయడల యుక్తిస్థిఘనమగు జ్ఞానమున్ను కావలయును, లేనియడల ముముక్షువగువానికి కోరిక సఫలంకాదు.

## సంవత్సరములు

ప్రభవ అనగా పరిజ్ఞానమనే వస్తువ. నీవు తెలియవలెనంటె వైరాగ్యపరిభావమే ముఖ్య కర్తవ్యము. విభవయనగా వివేకాదిగుణములు సంపాదించి భవబంధము విడువుము, సుక్ల యనగా అట్టి వివేకాదులు సుక్లవర్ణమగు

సత్వంవల్లనే పట్టుపడును. ప్రమోదూత యన ప్రమాద రహితుడై మాయయను దూతను వీడుము. ప్రజోత్పత్తి యన ప్రకృతివలన వుత్పత్తియగు ఈ సర్వమూ మిథ్యగా భావింపుము. అంగీరస అన అకార వుకార మకారముల ద్వారా నిన్ను యీ ప్రకృతి అంగీకరింప చేసుకొన్నది. శ్రీముఖ యన శ్రీయనే జ్ఞానం ముఖతా ఈప్రకృతియను మాయను దాటగలవు. భావ యన అట్టి జ్ఞానభావము తప్ప అన్యమార్గము లేదు. యువయన యూహాపోహలవల్లనుంచిన్నీ వైరాగ్యమువల్లనుంచిన్నీ ఆ జ్ఞానలక్ష్మి పట్టుపడును. ధాత యన ధైర్యం లేనియడల తత్వం గోచరంకాదు. ఈశ్వర యన ఆధైర్యం ఎట్లు అలవడుననగా పూర్వపుణ్యమనే ఈశ్వరక్రుప యుండవలెను. భహుధాన్య యన అనేక జన్మములనుండి ధనధాన్య సంపాదన చేయుచునే యుంటివి. అవి యేమైనా ఇప్పుడు పనికివచ్చుచున్నవా అనగా అశాశ్వితములని భావము. ప్రమాది యన అట్టి ధనధాన్యములయందు మోహం విడువనియెడల ప్రమాదం కల్గును. విక్రమ యనగా వివేకం చేతను క్రమముగా మాయను దాటుము. వృష యన యెద్దు వంటి మనసు మోహం విడువలేక యున్నది. గాన వేగం విడిపించుకొనుము. చిత్రభాను అన అట్టి వివేకరూపిణియగు మనసు లయమందిన యడల చిత్రవిచిత్రమగు కళాస్వరూపమగు భానుని దర్శించుము. తారణ యనగా అట్టి జ్ఞానముకు ముందు వితరణ బుద్ధి యుండవలెను. పార్థివ యన ఈ

ప్రకారం వెనుక అర్జునుడు మసలుకొనెను. వ్యయ యన ఈ చెప్పినదానియందు నమ్మిక లేనియెడల నీమానవజన్మము వ్యర్థము. సర్వజిత్తు యన జీవునకి సర్వజగం జయింపబడి యున్నది. సర్వధారి యన ఈ సర్వప్రపంచకమునూ ఆబిక్క సత్పదార్థమే ధరించినది. విరోధి యన అనగా అట్టి ఆత్మతప్ప అన్యం గ్రహించిన అద్వైతమునకు విరోధము కలుగును. వికృతి యనగా ఆ ఆత్మను ప్రకృతి వికృతులు రెండునూ మరుగుపరుచుచున్నది. ఖర యనగా ఆ ఆత్మ త్రికాలములయందు ఖర్మయనే దేహముల నంటలేదు. నందన యనగా అట్టివస్తువ తెలిసెదనంటే నాదానందము కొరకు పాటుపడవలెను. విజయ యన నాదానుభవములోను మనసు లీనమైనయెడల విజయము పొందగలవు. జయ యనగా అట్టి ఆనందము కలిగినయడల నిన్ను జయాపజయ ములు బాధించవు. మన్మథ యన మనసు వున్మనీ అవస్త నొందినయెడల తాత్రిబాధలు నిన్ను బాధింపవు. దుర్ముఖి యన నీమనసు దుర్మార్గములో చేరజూచినను నీవు ఊర్ధ్వ ముఖమగుము. హేవలంబి యనగా నీవు నిరాలంబన మవలం బించిన యడల హేమమనగా సువర్ణచ్ఛాయవంటి ముక్తి కాంతసంయోగం కల్గును. విలంబి యన వివేకంవలననే అట్టి బింబభూతుని దర్శింపగలవు. వికారి యన వివేకంచేతనే కార్యకారణముల వివరం తెలియును. శార్వరి యన శాశ్వత పదార్థం ఆరంభంలో తెలియకున్నను అభ్యాసమువల్ల

తెలియవచ్చును. ప్లవ యన ప్రకృతిలక్షణం వైరాగ్యంవల్లనే
గాంచగలము. సుభకృతు యనగా యీ చెప్పినప్రకారం
నీవాచరించినయడల సుభమగు ఆకృతి నొందగలవు.
సోభకృతు యనగా అట్టి ఆనందం నెరిగినయెడల చాలా
సోభస్కరముతో కూడిన ఒక ఆకృతిగల ముక్తికాంతా
సంయోగము కల్గును. క్రోధి యన నీవు ఇట్టి ప్రయత్నంలో
నిలచినయెడల పూర్వజన్మకర్మయను మాయ నీయందు
క్రోధం వహించగలదు. నీవు అందుకు వెరవకుము.
విస్వావసు యనగా నీవు విడువని ప్రయత్నం చేసినయెడల
అపరాప్రకృతియే స్వరూపము గాగల ఈశ్వరునికి
నీయందు విశ్వాసము కల్గును. పరాభవ అనగా అట్టి ఈశ్వర
కృపకు నీవు పాత్రుడవైనయడల మాయకు పరాభవము
కల్గును, ప్లవంగ యన ప్లవయన కోతికి నొక అర్థం కల్గును,
అట్టి మనసుని అంగహీనురాల్నిగా చేయుము. అనగా
భ్రాంతిపీడుము. కీలక యనగా అట్టి మనోభ్రాంతి నిరసించు
టకు గురుకీలు తెలియవలెను. సౌమ్య యనగా అట్టి గురుప
దేశం ప్రకారం నటించిన గుణసామ్యావస్త కల్గును.
సాధారణ యన అట్టి అనుభవం సాధారణం గాదుసుమా
బహు దుర్లభం. విరోధికృతు అన నీప్రారబ్ధముకు విరోధంగా
యుండవలెను. పరీధావి యన అట్టి పరమాత్మను తెలిసే
టందుకు ధైర్యమున్ను వివేకమున్నూ కావలయును.
ప్రమాదీచ యన అట్టి వైరాగ్యం కావలయునన్ననూ

ప్రమాదరహితమగు చమత్కారముండవలయును. ఆనంద అనగా ఆ వుపాయయుక్తులను గలిగి పాటుపడినయెడల ఆనందం పొందగలవు. రాక్షస యనగా అట్టి ఆనందం సామాన్యంకాదు. దానిచుట్టునూ కామ క్రోధాదులను రాక్షసులు కావలిగా యుండిరి. నల యనగా ఆ రాక్షసులు నాదంవల్ల లయం కాగలరు. పింగళ యనగా పింగళవర్ణము గల గుణత్రయముకూడ కలదు. కాళయుక్తి అనగా కాక తాళికాన్యాయంగా యుక్తిసంపాదించిన వెంటనే ఆ గుణ త్రయంకూడ నశించగలదు. సిద్ధార్థి యన అట్టి అనుభవం యెప్పుడో అదేకల్గునని అనారంభంగా యుండక పూర్వపక్ష సిద్ధాంతములచే అట్టిపదవి ఆర్జించుము. రౌద్రి యనగా రౌద్రాకారమగు నీప్రపంచకపు భ్రాంతులలో జొరకుము. దుర్మతి యనగా దుష్టచర్యలచేత మది చదరగొట్టకుము. దుంధుభి యనగా దుంధుభియను రాక్షసివలే ముందు కలికాలం వచ్చును గాన అందుకు చిక్కకుము. రుధిరోద్గారి యన రౌద్రాకారమగు కామ క్రోధాదులయందు రమించ కుము. రక్తాక్షి యన అట్టి నీవు కామమును విడువనియడల రక్తవర్ణములగు నేత్రములుగల మాయాశక్తి నిన్ను ఆశ్రయించును. క్రోధన యనగా ఆకాలమం దట్లు నిలువక క్రోధంగా పరిణమించును. అక్షయ యనగా ఈ చెప్పిన వాటిని నీవు మననంచేసి నిధిధ్యాస చేసినయడల అక్షయ మగు ఆనందం పొందెదవు గానీ అట్లుకానియడల క్షయించే ఆనందం యొందులకు.

## అయనములు

ఉత్తరాయణం దక్షిణాయనం అనగా నీవు యెప్పుడైనను ఉత్తర మనే ఊర్ధ్వముఖంగా నే యుండుము గాని దక్షిణమనే అధోముఖంగా యుండరాదు.

## ఋతువులు

వసంతఋతువు యన ఆత్మజ్ఞానం కల్గుటకు కూడా ఋతుకాలం కావలయును. అది యేదియన వైరాగ్యాది గుణములతో సంతతము పాటుపడుచుండుటయే ఋతుకాలం. అప్పుడు జ్ఞానమను వృక్షములు సుగుణములను చిగుళ్లుపెట్టి శ్రద్ధాభక్తులను పిందెలు పువ్వులు కలిగి అనుభవమను పండ్లనిచ్చును. గ్రీష్మఋతువు అనగా అట్టి అనుభవమునకు ముందు గ్రీవమనే కంఠమునందు సమస్తసంగతులు కంటస్తముగా వుండవలెను. తరువాత షడ్సంపత్తియందు మమత విడుచుటయే జ్ఞానమునకు ఋతుకాలం. అప్పుడు వైరాగ్యమను యెండ అతితీవ్రంగా యుండును. వర్షఋతువు అనగా ఆ వైరాగ్యంయందు హర్షంగా యుండుము. శరదృతువు అనగా అట్టి విధముగా పాటుపడుటలో శాంతము గంటివేని ఆత్మారాముని యందు రమించగలవు. అప్పుడు వివేకమను వెన్నెల కాంతి యెక్కువగా వుండును. హేమంతఋతువనగా బంగారం వంటి కాంతిగల మత్తకాసినిని పొడగనగలవు అప్పుడు ఆనందమను మంచు విస్తారముగా యుండును. శశిఋతువనగా

చంద్రుడనిన్నీ మనస్సనకు చంద్రు డధిదేవత కనుక అట్టి వృత్తి ఆత్మయందు లయించడం. అదియే తగినరుతువు అప్పుడు సంకల్పవికల్పములు రహితమై చల్లగాయుండును.

## పక్షములు

శుక్లపక్షం కృష్ణపక్షం యనగా జీవుడనే పక్షికి విద్యావిద్య లను రెండు రెక్కలుగలవు. అనగా తాను సుషుమ్నాద్వారంలో చొరుటకు ఇడాపింగళను రెండుపక్షములుండినను వ్యవహారదశలో పింగళయను పక్షమందు వాలినను పారమార్థికదశయందు యిడాయను సూర్యనాడిగానే సంచరించుము. అట్లుకానియడల తరించలేవు.

## మాసములు

చైత్రం యన చరాచరములయందు నిండిన వస్తువ ఒకటికలదు. అది గుణత్రయములను మూరువేషధారియై యున్నది. గాన వేగ గ్రహింపుము. వైశాఖం అన ఆవస్తువను గుర్తించుటకు వైరాగ్యమున్నూ శాస్త్రమున్నూ కావలయును అప్పుడు ఖంయన ఆకాశవతుగా నున్న వస్తువను గాంచగలవు. జ్యేష్ఠం యన అట్టి జయప్రదమగు వస్తువును తెలియుటకు అష్టాంగయోగములు అభ్యాశింపుము. ఆషాఢం యన ఆఆత్మ తెలిసేటందుకు మొదట షోడశాక్షరీభావం తెలియవలెను. అనగా కలలో దోచిన శరీరాదులెట్లో అట్లే తెలియవలెను. శ్రావణం యన అట్టి అనుభవం

కల్గుటకు శ్రవణం ముఖ్యంగా వుండవలెను. భాద్రపదం యన అట్టి శ్రవణంయందు భద్రంగా వుండవలెను. అట్లుండిన పరమానందం పొందగలవు ఆశ్వీజం యన ఆ ఆత్మను శ్వీయంగా తెలియువలెనేగానీ అజాగ్రత్త పనికిరాదు. కార్తీకం యన అట్టి ఖర్మయను జన్మరహితమగు పదవి ఆర్తిపొందిన ముముక్షువులకే కాని మందాధికార్లకు తెలియబడదు మార్గసిరం యన అట్టి మర్గపదార్థాన్ని తెలియుటకు సిష్టాచారం కావలయును గాని దుష్టాచార్లకు దొరకదు. పుష్యం యన పూర్వ సంస్కారం కలవార్కిన్ని విధినిషేధములను అతిక్రమించని వారికిన్ని పట్టుపడును. మాఘం యన మాయవలన కల్గు ఖంవాయుర్జ్యోతిరాపః అనువాని నతిక్రమించవలెను. ఫాల్గుణం యన ఈయనుభవం యెవరు తెలిపిరనగా పూర్వం అర్జునునకు శ్రీకృష్ణుడు చెప్పెను.

## తిధులు

అమావాశ్య యన ఆ ఆత్మను తెలియుటకు వైరాగ్యంతో కూడిన శాస్త్రం కావలెను. పాడ్యమి యన పరోక్షరూపుడగు గురువుద్వారా అజ్ఞానమను జాడ్యము వదలించుకొనవలయును. విదియ యన వివేకంవల్ల నుంచిన్నీ ధీయనా ధీరత్వంవల్లనుంచిన్నీ యనుభవం తెలియవలెను. తదియ యన తస్వరూపం తెలియుటకు ధైర్యంలేనిది యనుభవముకు రాదు. చవితి యన చావుపుట్టుకలను దుఃఖం వివేకం లేనిది తెలియబడదు. పంచమి యన నీవు పంచభూతాత్మికమైన

దేహమును గని భ్రాంతిచెందకుము. షష్టి యన నిత్యం షట్చక్రములమీదుగ సంచరించే చైతన్యమును తెలిసి కొనుము. సప్తమి యన ఆ చైతన్యరూపమగు శ్వాసను సప్త చక్రమగు సహస్రారమును నిలుపుము. అష్టమి యన అచైత న్యం యెట్లు తెలిసెదనని ప్రశ్నించెదవేమొ అష్టాంగ యోగ ములు కావలయును. యెట్లుపట్టుపడు ననియెదవేమో నవమి యను నవవిధభక్తులు అభ్యసించుము. దశమియన ఈదిగువ చెప్పిన నవవిధభక్తులు అష్టాంగయోగములు అలవడిన వెనుక దశమిద్వారమగు సుషుమ్నయందు నిలుపుము. యేకా దశి యన అట్లు సుషుమ్నయందు నిలచినవెనుక దశేంద్రియ వృత్తులు ఏకత్వం చెందింపుము. ద్వాదశియన ద్వాదాశా క్షరీ భావం తెలియుము. అనగా యేమీలేని వృత్త బట్ట బయలు. త్రయోదశి యన గుణత్రయముచేత ఈ జనన మర ణములను దశ నీకు కల్గినదిగాని లేనియెడల నిర్వికారుడవు చతుర్దశియన చతుర్దశేంద్రియములను స్వాధీనపరచితివేని పౌర్ణమియను పండువెన్నెలలో నిలచెదవు. రెండవది ఆర్ణ వమనగా సముద్రమని యర్థముగలదు. జనన మరణ మను సముద్రమును అతిక్రమించునని యర్థము.

## వారములు

ఆదివారం యన ఆఆత్మను తెలియవలెనంటే వ యన వైరాగ్యం కావలయును. రం యన వైరాగ్యంవల్ల ఆత్మా కాముని దర్శించగలడని భావము. సోమవారం యన

సోహం సోహం అని నిత్యము పల్కుచున్న ఆత్మవైరాగ్యం చేతనే తెలియవలెను. మంగళవారం యన అట్టి మంగళ ప్రదమగు వస్తువ వైరాగ్యం లేనిది యెట్లు తెలియును. బుధవారం యన బుద్ధిమంతులగువారు అట్టి వైరాగ్యంవల్లనే తెలిసెదరు. లక్ష్మివారం యన అట్టి జ్ఞానలక్ష్మిని పొందుటకు వైరాగ్యం ముఖ్యము. శుక్రవారం యన అట్టిఆత్మను సులభముగా తెలియుటకు కొన్ని క్రమములు గలవు. అవి యేవియనగా అకార వుకార మకారములద్వారా కలిగిన త్రిపుట్లు అన్నిటికి వైరాగ్యమే కారణము. శనివారం యన శంఖనే సంశయము మొదలగునవి నసించుటకుగాను నిదానముతో గూడిన వైరాగ్యమే కావలయును.

## నక్షత్రములు

అశ్విని యన ఆత్మను తెలిసేటందుకు శ్వేతవర్ణమగు సత్వగుణముతో కూడిన నినాదం వుండవలయును. భరణి యనగా అట్టి భవబంధము వదలవలెనంటే అరణి కావలయును ॥శ్లో॥ ఆత్మాని మరణింకృత్వా ప్రణవంచోత్తరారణిం ధ్యాన నిర్మధనాభ్యాసాత్పా శందహాతి పండితః॥ అను శృతిప్రకారం తెలియవలెను. కృత్తికయనగా యెవ్వరైతే కుటిలం విడచి యీా చెప్పినప్రకారం ఆర్తిపొందియుండునో వారే ఖర్మ రహితం గాంచగలరు. రోహిణి యన ఇదివరలో చెప్పిన ప్రకారం అరణివలన గలిగిన జ్ఞానాగ్ని రోమరోమములకు

పట్టియుండవలెను. మృగశిర యన యిట్టి జ్ఞానమనే సిరి మృగతుల్యులగు జీవులకు అలవడదు. ఆరుద్ర యన ఆ ఆత్మను తెలియుటకు యీమనస్సును యూఢిగా వైరాగ్య మను ద్రావకంలో వెయ్యవలెను. పునర్వసు అనగా పురా కృత పుణ్యంవల్ల నరునకు సుజ్ఞానం కల్గును. పుష్యమి యన పూర్వజన్మఖర్మ నిశ్శేషంగా నసించినవారే యీమాయను మించగలరు. ఆశ్లేష యన ఆఅత్మను తెలిసేటందుకు క్లేశం విడచి షడ్గుణసంపత్తిలో చేరవలెను. మఖయన మాయా తీతులగుటకు ఖర్మరహితం కావలెను. పుబ్బయనగా పుణ్య ఖర్మలద్వారా పాపఖర్మ క్షయించగా భవబంధం వదలును. ఉత్తర యన అట్టి భవవిమోచనమునకు వుత్తరముఖం కావ లెనేగాని అధోముఖం పనికిరాదు. హస్త యనగా అట్లు వుత్తరాభిముఖమైన వెంట నేసద్గురువు హస్తమస్తక సంయో గము చేయును. చిత్తయనగా అట్లు అస్తమస్తకసంయోగ సమయమున చిత్తం అన్యం కానియ్యక దానియందే నిలు వుము. స్వాతియన అట్టి స్వస్వరూపజ్ఞానం కల్గుటకు తీవ్ర వైరాగ్యం కావలయును. విశాఖ యన అట్టిపదవికి వివేకం శాంతిన్ని కాంక్షయున్ను వుండవలెను. అనూరాధ యన అట్టి అనుభవమునకు రాగమున్ను ధైర్యమున్ను వుండవలెను. జ్యేష్ట యన అట్టి జయప్రదమగు జ్ఞానమునకు అష్టాంగయోగ ములును కావలయును. మూల యన అట్టి అభ్యాసముచే నీ యజ్ఞానం సమూలంగా నసించును. పూర్వాషాఢ యన

ఆఆత్మజ్ఞానమునకు నీవు అభ్యాసముచేయుటకుగాను పూర్వం పెద్దలు పూర్వాంగము లనియు వుత్తరాంగము లనియు అష్టాంగయోగములను ఏర్పాటుచేసిరి. శ్రవణం యన అనుభవం శ్రవణంరీత్యా తెలుసుకొనుము. ధనిష్ట యన అట్టి శ్రవణంయందు శ్రద్ధలేక ధనం సంపాదనయందు శ్రద్ధ గల దేని అనిష్టమేగాని ప్రయోజనంలేదు. శతభిషం యన ఇట్లు చేయనియెడల నీకు శతజన్మలైన భీతికలుగ జేసే షడూర్ములు మొదలగునవి విడువవు. పూర్వాభాద్రా వుత్తరాభాద్ర యన నీవు శ్రవణం పూర్వమందు వుత్తరమందును భద్రం కలిగి వుండవలెను. రేవతి యన రేప నేది యముని దినం గాన నీవతి తీవ్రంగా పాటుపడవలెను.

## పండుగలు

సంవత్సరాది యన సశ్శాస్త్రంవలన ఆదియగు పదార్థం తెలియవలెను. అక్షరతదియ యన క్షరం నసించును. కాన అక్షరస్వరూపం తథ్యముగా నెరుగవలెను. విజయదశమి యన విజయంగా దశమిద్వారమగు సుషుమ్న యందుగల కళలు తెలియవలెను. నరక చతుర్దశి యన చతుర్దశేంద్రియములను నరికట్టనియెడల నరకప్రాప్తి తప్పదు. భోగియన ముముక్షువగువారు మహాత్తైన పదవిని ముందు భోగించబోవుననుట. సంక్రాంతి యనగా ఆత్మతో మనసు సంక్రమించుటకు త్రివిధ దీక్షలూ కావలయును. కనుము అనగా ఆత్రివిధదీక్షలూ కావలయును. అట్టి విధిని కను

మనుట రథసప్తమి యన నీమనోరథమును సప్తచక్రమగు సహస్రారముననే నిలుపవలెను కాని మరెచ్చటను నిలుప వద్దనుట. ఈప్రకారం మనపూర్వులు శుభాశుభములయొక్క స్వరూపమును గుర్తించుటకుగాను పంచాంగము నకటి ఏర్పాటుచేసిరి. పంచాంగమనగా పంచఅంగములు అనగా పంచభూతముల వలననే సుఖదుఃఖములు ప్రాప్తించుచున్నవి. యిందుకు ॥శ్లో॥ శబ్దస్పర్శరూప రసగంధా సుఖదుఖసంయోగ హేతవహో పుణ్యపావ ఖర్మానుసారీ భూత్వా ప్రాప్తశరీర సంయోగ మప్రాప్తశరీర సంయోగ మితి కుర్వాణః॥ అని ఈప్రకాగం సర్వసారోపనిషత్తువలన తెలియవచ్చుచున్నది. మన పూర్వులు మనయందు దయగలవారై మనలకు ఇట్టి నిదానం సూచించిరి. గాన మనమట్టి అనుభవములను గ్రహించుట వుచితము. ఇట్లు చేయుటకు కారణం ఏమియ నగా మనపూర్వజన్మ ఖర్మయను పాపరూపులగు రాక్షసులు మన జ్ఞానరత్నమును అపహరించెదరని ఇట్టి మరుగుపదము లచే అనుభవమును చూపుచుండిరి. లేనియడల వారికి తెలి సినచో మనతాలూకు అఖండతెలివిని దృశ్యరూపముగా మార్చినపుడు మనరుషులు మనలకు బోధించిన వాక్యము లను మార్చలేరా గాన అది ఆలోచించియే మన పూర్వులు ఇట్లు గూఢముగా మనలకు బోధించుటకు కారణం తరువాత వారి యభిప్రాయం యేదియన మనవంశములో పుట్టిన స్త్రీ పురుషాదులలో వకరైనా బుద్ధిమంతులుండిన యడల ఇట్టి

నిజం గ్రహించకపోవునా యని వారి యభిప్రాయము. తరువాత మన తాలూకు విఘ్నదేవతలు యవరైనా ఇపుడు మానవరూపులుగానుండు పామరజనులే మనలను అనేక విధములచేత బాధింపుచుండిరి గాన వారిని గుర్తించుటకు తగిన తెలివియుండియూ కూడ యింత అజాగ్రతపడుట ధర్మం కాదు.

## కుచేలోపాఖ్యానము

ఓ సోదరులారా కుచేలోపాఖ్యానమునకు ఇచ్చట నిజమగు అర్థము ఏదియన శ్రీకృష్ణ కుచేలుల వివరం మొట్టమొదట వీరిద్దరూ సాందీపునివద్ద విద్యాభ్యాస మొనర్చినట్లును కొంతకాలమునకు ఇరువురికీ వియోగం కల్గి తిరుగా సంయోగమందినట్లుగా తెలియవచ్చినది. అది యెట్లనన అనగా సత్పదార్థసన్నిధాన మాత్రమున ధీయన ధైర్యంగల బుద్ధితోడ పూర్ణంగా నిజానిజములను పరిశీలించెను. అనగా ముందు సనాతన ఋషుల యభిప్రాయ ప్రకారం మొదట బ్రహ్మచర్య ఆశ్రమస్వీకారం చేసి అందు సద్గురు సన్నిధిని ఆత్మ ఒక్క నిజానిజంబును గ్రహించి తదుపరి గృహస్థాశ్రమమునను ప్రవేసింపుడని శలవిచ్చియుండిరి. అట్లు చేసిన యెడల ఈవ్యవహారవాసనలు తననుబంధింపవనిన్నీ తద్వారా కొన్నికొన్ని ధర్మములను ఇతరులకు బోధించి తద్వారా పంచరుణములవలన కలిగిన ఈమానవజన్మముకూడా రహితము చేసుకొని కేవలమోక్షమునే పొందెదరని యభి

ప్రాయము. గాన ఇందుకు సారకాయయే దృష్టాంతము. అట్లు కృష్ణ కుచేలు లిద్దరును జీవఈశ్వర్లుగాన మొదట అట్టి నిజానిజం గ్రిహించి తదుపరి ఈశ్వరస్థితినుండి ప్రికృతి వశమున జీవరూపముగా మారెను. అనగా మాయోపాధికుడు ఈశ్వరుడనియు అవిద్యోపాధికుడు జీవుడనియు యున్నది. గాన ఇద్దరకును వియోగము కలుగుటకు కారణమేదియనగా తాను వ్యవహారధర్మములు కించత్తుగా తనయందు ఆరోపణ చేయుటవలన కించజ్ఞుడను జీవునకు సర్వజ్ఞుడనే ఈశ్వరుని దర్శించుటకు శక్తిహీనుడయ్యెను. తదుపరి సుశీల యను భార్యా యేది యనగా సుద్ధాంతఃకరణ మనిన్నీ చతుర్వింశతీతత్వములే పుత్రులుగానున్న అవిద్యోపాధియగు ఈ దేహమే చిన్న గృహముగానున్న ఈ ప్రపంచకమే చిన్నపల్లెగానున్న గ్రిహించునది. అందు బ్రిహ్మజ్ఞానం దార్ఢ్యముగా వ్యవహారదశయందు లేని లోపముచే దరిద్రిస్థితి యందు యుండెననిన్నీ అట్లుండియూకూడ సర్వకాలముల యందు ఈశ్వరధ్యాన పరాయణుడై యుండెననియు తన భార్య యగు సుద్ధాంతఃకరణ మహాపతివ్రతయనియు అనగా మలినాంతఃకరణయగు నెడల వ్యవహార వాసనలయందు జీవుని బంధింపుచుండుననియు అట్లు లేనియడల బంధింపజాల దనియును అట్లు సుద్ధాంతః ఖరణమైనప్పటికిన్నీ ఇంద్రియములనే బాలురు ప్రాపంచకవిషయ రూపకమగు తినుబండారమును కావలయునని తల్లిని భావించుచుండ ఈ ప్రతిబంధక

సామగ్రియగు వీరి బాధను తొలగించుకొనజాలక తన భర్త యగు జీవుని కించిత్తు విషయరూపమగు ధనమును కోరుచుం డెను. అనగా ధ్యానసమాధులనుండి జాగ్రతఅవస్తగా పరిణ మింప చేసెను. ఇట్లు ఎన్నిసార్లు తను స్థిరముగా యుండినను ఇట్లే చేయుచు రాగా జీవుండు ఇట్లు చింతించెను. మన మెన్నిసార్లు యోగ మభ్యసించినను ధ్యాన్నమునందు పరి పక్వము కానియెడల ఇట్టి యోగమునందుకూడా చిత్త స్థయిర్యము నొందకుంటిమని యోచించినప్పుడు ఈశ్వరు డనే కృష్ణుని దర్శించుమని తన భార్యతో చెప్పుచుండ అట్టి సర్వజ్ఞుని దర్శించుటకు రిక్తహస్తముల నేగుటకు ధర్మము కాదని చెప్పగా ఆమె వెదురుబియ్యమును అటుకులుగా చేసి యిచ్చెదననగా వేదములవలన ప్రతిపాదింపబడిన గ్రంధ రూపమగు శ్రవణమనననిధిధ్యాసములను మూడు పిడికెళ్ళ అటుకులను ఇచ్చెను. అవి పట్టుకొని సర్వజ్ఞుడగు కృష్ణుని దర్శించుటకు బయలుదేరి వెళ్లుచుండగా మధ్యను అహంకారు డను గొల్లవాడు ఇట్లు ప్రశ్నించెను. ఓ కించజ్ఞుడనగు ఓ జీవుడా నీవు సర్వజ్ఞుడను కృష్ణుని దర్శించుటకు వెళ్లుచుంటివి గాని బహుదుర్లభమని యీ మొదలుగా అథైర్యము కలి గించినను సంస్కారబలముచే నెట్టకేలకు ద్వారకాపట్నము ప్రవేసించెను. అనగా శృ॥ ద్వేవిద్యే వేదితవ్యేతు శబ్దబ్రహ్మ పరంచయతు। శబ్దబ్రహ్మణినిష్టాతా। పరంబ్రహ్మాదిగచ్ఛతి॥ అను శృతిప్రమాణము. ద్వ అనగా రెండనిన్ని పర అను

రెండువిద్యలతోను అపరా కూడిన ద్వారకాపట్నం ప్రవే సించి అనగా ద్వాఅనే రెండువిద్యలద్వారా తనరకం తెలియబడునని గ్రహించునది ఈప్రకారం మహాకారణ మనే తురియా అవస్తం బ్రవేశింపగా అచ్చట సాధనచతు ష్టయ సంపత్తియను ద్వారపాలకుల్ను శమాది షట్కసంపత్తి యును యీ మొదలగు పరిచారకులు కించజ్ఞుడగు జీవుని సర్వ జ్ఞుడగు పరమాత్ముని దర్శించుటకు తురియాతీతమను అంతః పురమున ప్రవేసించుటకు నడ్డుపరచిరనగా ఇచ్చట కుచేలు డనగా నేదియన చాలమనగా వస్త్రమనిన్నీ కృషించిన వస్త్రం గట్టినాడని బాహ్యార్థము. ఆంతర్యం యేదియనగా దేహమే వక వస్త్రమనిన్నీ అట్టి దేహభ్రాంతులు క్షీణించు టచే కుచేలుడనబడును. అట్లు వారు అడ్డుపరచినను అధై ర్యము నొందక ఆకోటకు దశావతారములను చూచి కొంత మట్టుకు తృప్తిచెందెను. యట్లన పరోక్షజ్ఞానమందు గల నాదానందమును చిత్కళస్వరూపములను చూచి యానం దించెను. ॥శ్లో॥ తురీయం మూర్ధిసంస్తితం యనునట్లు భ్రూ మధ్యస్థానమే తురీయము గాన అచ్చటగల చిత్కళాస్వరూ పములను దర్శించి తృప్తిచెందెను. శ॥ యదృచ్ఛా లాభ సంతృష్టో ద్వంద్వాతీతో విమత్సరః॥ అనునట్లు నిలువగా క్రమేణా సాధనచతుష్టయము మొదలగు వారలకు కరుణ గలిగి అట్టి ఆత్మడనే కృష్ణునకు తెలియపర్చగా లోనికి తీసుకుని రమ్మని ఆజ్ఞాపించెను. అనగా తురీయాతీతమను

అంతఃపురమున చేరుటకు అర్హత కలిగెను. అట్లు నేగుచుం
డగా కృష్ణుడెదుర్కొని కౌగిటచేర్చుకుని తన శయ్యయందు
నునిచి పరిచారములు చేయుచుండెననగా తాను ధ్యానము
నుండి సమాధియను తురీయాతీతమనే అంతఃపురమున ప్రవే
శించుటలో నేను జీవుడననిగాని పైగా ఆత్మని దర్శించుటకు
సమాధిని సలుపుచుంటి ననిగాని ఈ మొదలగు ద్వైతభ్రాం
తులు నశించినవాడై నిర్వికల్ప సమాధి నిష్టయందుండుట.
అంతట జ్ఞానశక్తియను రుక్మిణిగూడ పరిచర్యలుచేసె ననగా
యేవిధమగు విఘ్నములు కలుగజేయకుండుటచే పరిచర్యలు
సల్పుట యిట్లు కొంతతడవు నిలచినవెనుక కృష్ణుడు కుచే
లుడు తెచ్చిన అటుకులు రెండుచారలు భక్షించెననియు
మూడవచార భక్షింపబోవ రుక్మిణి అడ్డువచ్చెననగా శ్రవణ
మనన మను రెండును తనయందు లయంచేసుకొని నిదిధ్యాసన
మునకు లోపము కలిగెను. యెందువల్లనన వ్యవహారదశ
యందు నిధిధ్యాసనమునకు అర్హతలేదనిన్ని అట్లు కలిగిన
కైవల్యములో అది మోక్షదశయే యగును గాని వ్యవహారమను
టకు వీలులేదనిన్నీ అందుచే తిరుగ జాగ్రతావస్థకు జీవు
డనే కుచేలుడు రాకతప్పదనిన్నీ అట్టి చిచ్ఛక్తి యోచించి
అంతతో నిల్పుచేసెను. తరువాత తన అవిద్యోపాధియగు
పల్లెగ్రామమును ప్రవేశించుటకుగాను తురీయాతీత మను
ద్వారకానగరం విడచి యెట్లు వచ్చుచుండెనో నెరుగకపోవు
చుండగా మధ్య అహంకారుడను గొల్లవాడు తిరుగా ఇట్లు

ప్రశ్నించెను. యెట్లన నేను నిన్ను కృష్ణునివద్దకు నేగవద్దని చెప్పినను నామాట వినక నీవు నేగితివి. అనగా కించజ్ఞుడగు జీవుడై యుండియు ఎక్కడనో తురీయాతీతుడగు ఆత్మను యెట్లుదర్శించెద వనిన్నీ సనాతనరుషులు ఫల, పర్ణ, జల, వాయువులను భక్షణచేసి అనేకవేల యుగంబులు తపం బాచరించినను నిజమగు ఆత్మను దర్శించలేరైరి. అట్టిసమయ మున నీవు గృహాస్తుడవై యుండియు యెట్లు స్వస్వరూప మును దర్శింతువు. అని చెప్పినను వినక నేగితివి. అట్టి ఆత్మను దర్శించిన విధమును నెరింగింపమన వాచమగోచరమగు ఆనందమును వ్యవహారదశలో తెలుపుటకు నశఖ్యంబుగావున తెలుపలేక మిన్నకుండియు ఇట్లధైర్యము నొందెను. యెట్లన స్వరూపానందమును ఇతరులకు చెప్పకుంటిమిగాన మనకు నిజ మగు అనుభవము కల్గులేదేమొయని సంశయగ్రస్తుండయ్యెను దీనికే భార్యామున కృష్ణుడు ధనధాన్యములను కానుకనిచ్చి పంపలేదని కించెత్తు విచారించి తరువాత ఆ సర్వజ్ఞుని దర్శిం చుటకన్న ధనమధికమా యని తృప్తిచెందెను. అనగా సర్వాత్మభావన యొక్క ఆనందము తాను వ్యవహారదశ యందు స్ఫురణమాత్రముగా యుండిన చాలదా వాచాగా వచించుటకు శఖ్యముకానందున ఇది నిజమగు ఆనందము కాదని భ్రాంతినొందితిసి. కాన బహు పొరపాటు ఆనంద మును మించిన పదార్థము లేనందున తానే ఆనందరూపుడని నిశ్చయించి యధాస్థానమునం ప్రవేసించెను. అనగా

అవిద్యోపాధియగు ఈ దేహస్ఫురణకలైను. ఇట్లు కొంతదవ్వో
నకు ఆరూఢస్థితి ప్రాప్తించగా ఆ ఆనందమును అభ్యాసకు
డుగా నున్నపుడు ఇతరులకు తెలియపరుపలేకున్నను ఆరూఢ
స్థితియందు అనేక దృష్టాంతరములద్వారా పలు తెరంగుల
తమ శిష్యులకు బోధించి యనుగ్రహించు విధంబున ఇచ్చట
కుచేలుడు తన పల్లెగ్రామమునకు బోవుటలో ధనకనక వస్తు
వాహనాధికమగు సర్వంబును సమృద్ధిచెందెననియు తన సృష్టి
భూతమగు గృహమును గ్రహించలేక దిగ్భ్రమ చెందియుండ
అంతట భార్యవచ్చి గృహమునం బ్రవేశపెట్టెనని చెప్పిరి.
ఇచ్చట కించజ్ఞత్వాది గుణములతో కూడిన అవిద్యోపాధి
యందు అధ్యాత్మిక అధిభౌతిక అధిదైవిక వికారములు
నశించి దీనికి సాక్షియై కేవలాత్మగా నిలచెను కాని ఇట్టి
హంశ తనకెట్లు సంభవించెనో గుర్తెరుంగకయుండెను అనగా
తనారంభకుడుగా యుండినపుడు అహంభావనా విపరీత
భావనా చూడగా తనను ఇట్టిస్థితియందు చేరనిచ్చునని
స్వప్నమందైనను తలంపకుండుటచే ఆ సద్గురువును దర్శించి
నను మనకిట్టి పదవి కల్గుననిగాని కలుగదనికాని తలంచకుండి
నను ఈ జన్మములో ఈ దేహమం దుండుటలో ఇంత గొప్ప
పదవి కల్గుటకుగాను దేహపరవశుడై దిగ్భ్రమ చెందెను,
అనగా ఆరంభకునికన్న అభ్యాసునకునూ వానికన్న ఆరూఢు
నకును సద్గురునియొక్క మహిమాతిశయంబులు గోచర
మగును. అట్లు ధనము తనకు లభించినను అందు బంధింపబడి

నిలువక తన పుత్రులకుగాను యాధన మొసంగి తన భార్యా సహితముగా అరణ్యమునం ప్రవేసించి విదేహముక్తి సుఖమును నొందెననిరి. అనగా యిచ్చట వాచాజ్ఞానముతో తృప్తిచెందక తన శిష్యులకు ఈజ్ఞానధనంబు నొసంగి అనగా వ్యవహార దశయందు యింద్రియము లనే పుత్రులకు జ్ఞాన ధనంబు నొసంగి తాను సుద్ధాంతఃకరణయగు భార్యతోడం గూడి తురీయాతీతంబున ధ్యానసమాధులనుసల్పుచు క్రమేణ జీవన్ముక్తి విదేహముక్తులను చెందెనని గ్రహించునది.

సమాప్తం.

---

# శ్రీకృష్ణ తులాభారం

ఓ సోదరులారా! పూర్వము భాగవతములో శ్రీకృష్ణ తులాభారం హరికథరూపముగా మన పెద్దలు వాడుక చేయుచుండిరి. యిప్పుడు ఆకథకు మనము అంతర్యము గ్రహించవలసివున్నది. యెట్లన (శ్రు) "మనోహిద్వివిధప్రోక్తం శుద్ధంచశుద్ధమేచవ అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం" అను శృతిప్రకారం మనస్సు శుద్ధమనియు, అశుద్ధమనియు రెండు విధములు. అందు శుద్ధమనస్సే రుక్మిణి యనియు, మలినమనస్సే సత్యభామ యనియు, అనగా సత్పదార్ధమును అభావముగా చూచుటచే సత్యభామ యనబడును. అందు ఆత్మడను కృష్ణుడు ఈ యిరువురు భార్యలతోడను యింద్రి

యములను గోపికలతోడను, దేహమును ద్వారకాపట్నమున కాపురము చేయుచుండెను. (శృతి) "ద్వాసుపర్ణా స్తే యుజాసఖాయా వృక్షోది విష్ట న్యేక మేకం ద్వివిధా విధాయా తయోరన్య పిప్పలస్వాదు సవిశాఖసీతా" అనగా ఒకవృక్షమునకు రెండుశాఖ లున్నవనిన్నీ అందు రెండుపక్షులధిష్టించి యున్నవనిన్నీ అందు ఆడుపక్షి ఆచెట్టునుంగల చేదుఫలములను భక్షించుచుండగా అందు మొగపక్షి ఆడుపక్షిని చూచి శరీరము పులకాంకురముకలదియై నిలచి యుండెను. అనగా దేహమనెడి వృక్షమందు మాయా అవిద్యాలనెడు రెండు శాఖలు గలవు. అందు జీవఈశ్వర్లను పక్షులు నివసించుచుండెను. జీవుడను ఆడపక్షి విషయములను చేదు ఫలములను భక్షించుచుండగా ఈశ్వరుడను మొగపక్షి యీ యద్భుత కార్యమునుచూచి అసహ్యించుకొనుచుండెను. అనగా స్థూలవాసనలు జీవునకున్నూ సూక్ష్మవాసనలు ఈశ్వరునకును గలవని గ్రహించునది. గాన ముందుచెప్పిన కృత్యాభిప్రాయప్రకారం ద్వారకాపట్నమున ఆత్మడను కృష్ణుడు నివసించియుండగా కొంతకాలమునకు సూత్రాత్మ యను నారదుడు ద్వారకలో ప్రవేసించెను. అట్లు ప్రవేసించి ఆత్మడను కృష్ణుని శుద్ధాంతఃకరణ యను రుక్మిణిని దర్శించి వారి వద్ద శెలవుపుచ్చుకొని మలినమనస్సనెడి సత్యభామ గృహమునం బ్రవేసించి ఆమెచే పూజనుగైకొని శుద్ధాసనముపై గూర్చునియుండగా సత్యభామ ఇట్లు ప్రశ్నించెను. యెట్లన

మునివర్యా నేను యిదివరలో యేసుకృతపరిపాకమువలననో ఆత్మూడను కృష్ణునకు వ్యవహారదశయందు ప్రియభార్యగా నైతిని, పారమార్థిక దశయందు రుక్మిణి ప్రియభార్యగా యున్నది. గాన రెండుదశలయందు నేనే ప్రియభార్యగా నుండుటకు యేదియైనా వక గొప్పవ్రతమును నాచేత చేయించి నాభర్తను నాస్వాధీనము చేయుడని ప్రార్థించెను. అంతట నారదుడు చిరునవ్వు నవ్వి ఇట్లు చెప్పనారంభించెను. తల్లీ! నేను త్రిలోకములందు సంచరించుచుంటినిగాని నీవు కోరిన వ్రతమును నెచ్చటను గాంచనైతి. అనగా స్థూలసూక్ష్మకారణ శరీరములను స్వర్గమర్త్య పాతాళములయందు సంచరించి నను యిందుకు సాక్షియగు కేవలాత్ముడు మలినమనసున కెట్లు స్వాధీనమగును. అని స్వాగతమును విచారించి ఇట్లు నిశ్చయించెను. యెట్లన ఈమలిన మనసుయొక్క గర్వభంగము యెట్లయినా చేసితేనేగాని కుదరదని చెప్పి ఆత్మూడను కృష్ణునితో యోచించి సత్యభామతో ఇట్లు చెప్పెను. అమ్మా! నీభర్తయగు కృష్ణుని దానముచేసినయెడల అట్టి ఫలసిద్ధి నొందగలవని చెప్పి అనగా సాక్షికివినాగా నీయొక్క సంకల్ప వికల్పాది సృష్టులనాచరించిననేని అట్టి సాక్షి త్రికాలములయందు నీయొక్క స్వాధీనముందే మెలంగగలడని చెప్పగా మలినమనస్సనే సత్యభామ ఇంద్రియములను గోపికలతో యోచనచేసి సూత్రాత్ముడను నారదునితో ఇట్లు చెప్పెను. స్వామి అట్లు సాక్షికి వినాగా నేను సంచరించుట

యెట్లు యెప్పుడో నా స్వాధీనమందుండినను ప్రస్తుతము అట్టి సాక్షిని వీడిన నేను జడమగుదును. గాన ఇందుకుంగల వుపాయములను ఆనతియ్యుమని వేడగా నారదు డిట్లు బదులు చెప్పెను. యెట్లన నీభర్త యెత్తునుంగల ధన మిచ్చితివేని వెంటనే నీస్వాధీనమందుండునని చెప్పగా అనగా క్షణకాలము ఆత్మతో సంబంధించక విషయములందే నిలచుట. అందులకు సమ్మతించి నారదునితో సభ యేర్పాటు చేయమని చెప్పగా వెంటనే మౌనమను మునులను వేదాంతకృషియను రుషులను రప్పించి అనేక సుగుణములను దేవతలు ఆత్మడను కృష్ణుని సహితముగా భ్రూమధ్యమను సభయందు నిలచియుండిరి. అంత మలినాంతఃకరణ యను సత్యభామ ఇంద్రియములను గోపికల సహితముగా సభకు యేతెంచి బిగ్గరగా నిట్లు పలికెను. యెట్లన ఇందు యెవ్వరు నాభర్తను గ్రహించగలరని యడుగగా యెవ్వరును మాట్లాడకుండిరి. అందులకు మలినమనస్సు చింతించుచుండ ॥శ్రు॥ యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాసః! ఆనందమే తజ్జీవస్య యజ్ఞత్వా ముచ్యతేబుధః॥ అను శృతిప్రకారం దేహేంద్రియాదులు అట్టి ఆత్మను గ్రహించ నేరకుండుటచే అనగా ఆధారపదార్థము ఆథేయ మగుటయు, ఆధేయ పదార్థము ఆధార మగుటయు శ్రుతివిరుద్ధము గాన వూరకుండెను. అంతట సూత్రాత్మయను నారదుడు తాను గ్రహించెదనని చెప్పెను. ॥శ్రు॥ క్షీరం క్షీరం యథాక్షిప్తం తైలం తైలం

జలంజలే॥ యనునట్లు అట్టిసాక్షిని గ్రహించుటకు అట్టి చైతన్య మగు నారదునికే శక్యమగునేగాని ఇతరులకు స్వాధీనము కాదు. అందుచే నారదునికే దానమిచ్చెనని చెప్పబడెను. అనగా తాను సుషుప్తియందు కొంతవరకు లీనమాయెను. అట్లు దానమిచ్చిన వెనుక అనేక పుణ్యాకర్మలను క్షేత్రయాత్రలు అనేక దానధర్మములను ధనమును తీసుకొని వచ్చి భ్రూమధ్యమను సభామండపంబున రేచకపూరకములను ఇడా పింగళలను తక్కెడలో ఇడయను తక్కెడలో ఆత్మడన కృష్ణుని పింగళయను తక్కెడలో పుణ్యాకర్మలను ధనమును వేసి తూచినను ఆత్మకు సాటికాకపోయెను. కడకు యోగము వరకూ సాధించినను ఆత్మడను కృష్ణునకు తూగకపోయెను. అందుకు మలినమనసు యను సత్యభామ చింతించగా సూత్రాత్మయను నారదుడు ఇట్లు చెప్పెను. సుద్ధాంతఃకరణను రుక్మిణిని శరణుజొచ్చినగాని నీభర్త నీకు వ్యవహారమందైననూ స్వాధీనముకాడని చెప్పగా అందుకు మిగులచింతించి యెట్టకేలకు ఆమె యొద్దకు నేగి శరణుజొచ్చెను. యెట్లనగా నీవన్న బలమున్నా. ఆత్మయొక్క సత్తాయున్నా నాకు లేదుగాని నీవే యాత్మజ్ఞానమును నిలువ బెట్టుకొను మని చెప్పగా అంత సుద్ధమనస్సు ఆశ్చర్యమంది స్వాగతమున ఈమె గర్వభంగమునకే ఇట్లు తలంచితిరని యెంచి వెంటనే భూమిమధ్యమనే సభ కేతెంచి వారల ధనము నేవత్తూ పంచివేసెననగా, నేతి, నేతివాక్యములచే యిది కాదిది కాదని

కొట్టివేసెను. (శ్రు) "సదా నేతి నేతీ యత్రాగృణంతీ పర బ్రహ్మరూపం చిదానంద భూతం శివోహం, శివోహం, శివోహం, శివోహం" అనినట్లు తానొక తులసిదళము వేసెననగా, దళమనగా మూడు రేకులు గలదనియు అందుకు అధిష్టానమగు నొక తొడిమియనికదా యున్నది. అవి యేవి యన తత్, త్వం, అసి యను మూడు దళములున్న, ఇందు కాధారమగు సారాంశముతో కూడిన మహావాక్యమను తులసిదళమును వేయుటతోడనే ఆత్ముడను కృష్ణుడు తూగెను. అంతట అనేక సుగుణములను పువ్వులతోకూడిన ఆనందమను వర్షము కురసెను. దేవతావాద్యములనగా దశవిధనాదములు ప్రణవమండపంబున మ్రోగుచుండెను. అప్పుడు సూత్రాత్మయను నాగదుడు సుషుమ్నయను స్వర్గ లోకమునం బ్రవేసించెను. అంతట మలినమనస్సను సత్యభామ యున్న. యింద్రియములనే గోపికలున్న నిర్జీవులై వారివారి యథాస్థానమున నుండిరి. అంతట ఆత్ముడను కృష్ణునితో సుద్ధమనస్సనే రుక్మిణి ముక్తికాంతాస్వరూపంబున సహా పారమను అంతఃపురమునం బ్రవేశించి ఆనందించుచుండెను. సోదరులారా నా సద్గురు వనుగ్రహమువలన గ్రహించినంత మట్టుకు వ్రాసితిని. గాన యిందుంగల తప్పులను ఒప్పులుగా మన్నింపుడు.

సమాప్తం.

# దత్తాత్రేయ చరిత్ర

ఓ ఆత్మసోదరులారా ! ఇదివరలో మనపూర్వీలు శ్రీదత్తాత్రేయ చరిత్రము విశదీకరించిరి. గాన ఇప్పుడు ఆత్మపరముగా వ్రాయవలెనని సంకల్పము కలిగినది. యెట్లన వొకానొక అరణ్యమున అత్రి అనసూయ అను ఇద్దరు దంపతులు తపంబాచరించిరనియు, అనగా అరణ్యమన అరి సంభంది. అరివర్గమనగా కామక్రోధాది దుఃఖరూపులు. రణ్యమనగా ముందుచెప్పిన అరివర్గమునకు అన్యమగు వే నిశ్చలసుఖముగలదో ఆ అరణ్యమున అత్రియన త్రిగుణ రహితుడగు జీవుడున్ను, అనసూయయన అసూయారహిత మగు బుద్ధియు, ఇట్లుభయులున్ను ఆరూఢత్వసిద్ధికొరకు తపంబాచరించుచుండెను. అది అట్లుండ వొకానొకదినంబున నారదుడు అనగా (న) అన కాదనుమాట అరదములనగా ముందుచెప్పిన అరివర్గముతోకూడని సూత్రాత్మయనే నారదుడు వీరియొక్క తపోమహిమ సర్వలోకములకు వెల్లడించుటకుగాను దుర్విషయములనెడి ఉక్కు శనగలు తీసుకువచ్చి సద్విషయములనే గుగ్గిళ్ళుగా చేయుమని ముందుగా త్రిగుణములచే త్రిమూర్తుల భార్యలగు త్రిశక్తుల వద్దకు నేగి ఈదుర్విషయములను సద్విషయములుగా మార్చుమని వేడ, వారు ఇట్లు చెప్పిరి. ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి ఇట్లనిరి. మాయామాక్రియలేవన కేవలమున్ను ప్రకృతి విషయమున సృష్టిస్థితి లయములకు కర్తలమేకాని పరమార్థ

విషయమున కర్తలము కానందున అట్టి కార్యమునకు ఒడంబడకపోయెను. తదుపరి సూత్రాత్మయనే నారదుడు ముందుచెప్పిన త్రిగుణరహితఅసూయారహితులగు దంపతుల నొద్దకు నేగి దుర్విషయములను సద్విషయములుగా మార్చుమని చెప్పెను. యెట్లన త్రిమూర్తుల భార్యలగు త్రిశక్తులకును స్వాధీనముగాని కార్యమేదైనను మీరాచరించినయెడల వారికన్న మీరధికులుగా నమ్మెదనని చెప్పగా ధైర్యమును రక్షించెడి బుద్ధిప్రణవాను సంధానమనెడు మంత్రజులము వైరాగ్యరూపముగా దుర్విషయములనెడి పుష్కళశనగలపై శ్రద్ధాభక్తులను హస్తములచే ప్రోక్షించి జ్ఞానాగ్నియందు పచనము గావించెను. వెంటనే దుర్విషయములు సద్విషయములుగా మారెను. అనగా శ్రోత్రేంద్రియమునకు శబ్దము విషయము గావున అది విడచి తదితరమగు దశవిధనాదములను గ్రహించుటయే సద్విషయము. ఇదేమాదిరిగా జ్ఞాననేత్రములచే ఆత్మస్వరూపుని తాలూకు చిత్కళలను దర్శించుటయు, జింహ్వేంద్రియము శ్రవణమన నాదులనే అభిరుచి గ్రహించుటయు, త్వక్కు సాధుసజ్జనుల దర్శన స్పర్శనాదులచే ఆనందించుటయు, ఘ్రాణేంద్రియం దుర్వాసనల విడచి సద్వాసన గ్రహించుటయు ఇదే ప్రకారం సర్వవిషయములను సద్విషయములుగా మార్చెను. అంత సూత్రాత్మయనే నారదుడు ఈ సద్విషయములనే శనగలను అనుభవమనే భక్షణ చేయుచు మూడు లోకములలో ప్రజలకు

తెలుపుటకుచేసిన స్థూల సూక్ష్మ కారణములనే మూడు లోకములలో అంతరింద్రియములు భాహ్యేంద్రియము లనే ప్రజలకు తెలుపుడుచేసెను. తదుపరి త్రిశక్తులువద్దకు నేగి మీరు సేయలేని యద్భుతకార్యమును నెరవేర్చుకువస్తి ననియు అసూహ్యారహితులకు యెట్టికార్యమైనను స్వాధీన మగునని వార్ని స్తుతింపగా అది సహింపజాలక త్రిశక్తు లును త్రిగుణములనే భర్తలను ఇట్లు ప్రార్థించెను. యట్లన నాధా అట్టి అతీతపదార్ధమును దానియొక్క మహిమాతిశ యములను సూత్రాత్మయను నారదుడు గ్రహించుటయే గాక యింద్రియములనే ప్రజలకు తెలుపుడుచేసెను. గాన మనమట్లు వూరకొనినయెడల వ్యవహారమునకు భంగ మున్ను మనయొక్క గౌరవమున్నూ చెడును. గాన మీరు యెట్లయినను అతీతపదార్ధమును గ్రహించెడి బుద్ధియొక్క గౌరవమును చెరచి రావలయునని ప్రార్థించగా వారలు వల్లేయని కపటవేషధారులై అనగా శుష్క వేదాంతులనలె వచ్చిరి. అట్లు అసూయరహితమగు బుద్ధివద్దకు వచ్చి నిల చిరి. వారిరువురు త్రిమూర్తులను చూచి అతిధ్యమును స్వీక రించుమని వేడ వారట్లు పలుక నారంభించిరి. యెట్లన మీరు దిగంబరులుగా ఆతిధ్యంబిచ్చినయెడల గ్రహించెదమని పలుక వల్లేయని వీరు పలికిరి. యెట్లన మనసనను వస్త్రము ధరించ కుండా వాచాజ్ఞానంగా యుండినయెడల మేము సంతసించెద మని చెప్ప అశ్చర్యమంది వీరు బ్రహ్మవిద్యరొుక్క గౌర

వము చరచదమని తలంచిరని యెంచి భావ్యామున నట్లేయని యొప్పుకొనిరి. అట్లువారు కపటముగా తగిన- ఆసనముల యందు అధిష్టించియుండ ఆ పతివ్రత నిదిధ్యాసనమును భమిడి పళ్ళెములో పంచవిషయములను పంచభక్ష్యములను వారికి వడ్డించగా అనగా కపటులను కపటంగానే చూడవలెనుగాన మలినవృత్తులను జుట్టుచే మానావమానములను శరీరమును మరుగుపరచి వడ్డించుటకు ప్రారంభించ త్రిగుణములకు పంచ విషయములే ఆధారములు గావున అంతటితో తృప్తిచెందిరి. అంత నా పతివ్రతా మహాత్మ్యముచే అనగా దేహేంద్రియము లకు పతియగు ఆత్మను తెలియుటయే వ్రతముగాన పతివ్రత యనియు రెండవది వేదాభిప్రాయము తెలియనియెడల వ్రాత్యత్వము విడువదుగాన తస్వరూపము తెలియుటయే పతివ్రతయను పదముకు యర్థము. ఇందుకు (శ్రు) నిమిషం నిమిషార్ధంవా జ్ఞాని నోధ్యాత్మ చింతయా క్రతుకోటి సహ స్రాణాం ధ్యానమేకం విశిష్యతే యనియు (శ్రు) అన్యవిద్యా పరిజ్ఞానం మవస్యం నస్వరంభవేత్తు బ్రహ్మవిధ్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థిరం యన సంగతి గ్రహించునదియై ప్రణవమంత్రజలము వారిపై చల్లగా వారు ముగ్గురునుబాలు రైరి. యెట్లన బాల్యమనయే ఒక్క నిజానిజములు తెలియ పడనిస్థితి అనేవారి వారిసంకల్పములు అవ్యక్తమందు లీనమై యుండెను. తదుపరి ఉచ్ఛ్వాసనిస్వాస మను ఊయలలో పెట్టి వూచుచుండగా సూత్రాత్మ యను నారదుడు త్రిశక్తులకడ

కేగి ఈక్రమమంతయు తెలుపగా వారలు దిగులంది తమ భర్తలను రక్షించునిమిత్తము అనసూయకడకేగి ఇట్లుప్రార్థించిరి. తల్లీ త్రిగుణములు వ్యక్తముకానియడల వ్యవహారము నందు సృష్టిస్థితిలయమునకు అవకాశము చిక్కదుగాన మా భర్తలను మాకు ఇప్పించుమని వేడిరి. అట్లుకానియడల పాప జీవులయొక్క ప్రారబ్ధ మనుభవించుటయెట్లు అదియునుంగాక మేము కేవలము వ్యవహారమునకు లోబడినవారమే కాని పరమార్థముయొక్క సంగతి నెరుంగుము. కాన నీయొక్క మహిమ మాకెట్లు గోచరమగును. ఇట్టి గుర్తెరుంగక వ్యవహారమునకు నీవు లోబడియెదవేమోయని మోసబుద్ధిచే ఇట్లు ప్రవర్తించితిమి. గాన నీకీర్తి సూర్యచంద్రాదులుండు నగకు వర్ధిల్లుటయేగాక తిరుగా ముముక్షువులకు చాలా సహాయముగా యుండునని వేడగా దేహేంద్రియము లుండువరకు వ్యవహారం తప్పదనియు అందుకు త్రిగుణములు ముఖ్యము లని తలంచి తిరుగా ప్రణవమంత్ర జలముచే వార్ని వ్యక్త పరచి వారితో నిట్లు పలికెను. యెట్లన మీారు మోక్షాపేక్ష గలవారలను బాధించకుందురుగాకాయని చెప్పి పంపెను. అంతవారు పడిన పరాభవమునకు మిగుల కలతచెంది వారి వారి యథాస్థానమునం బ్రవేసించి తిరుగా ముముక్షువులకు సహాయపడుచుండిరి. గాన నాటినుండియు మోక్షానికి అర్హత గలది గృహస్థాశ్రమమని ప్రసిద్ధిచెందెను. (శ్రు) ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యత్రప్రతిష్టార్థమేవచా సన్న్యాసేదు భయభ్రష్టోన

ముక్తిర్నాత్రసంశయ యనియు (శ్రు) బ్రహ్మచారీ గృహ
స్థో వా వానప్రస్థో తథాయతిః నారీవా వృషలోవాపి పక్వో
బ్రహ్మవిచారయేత్తు యనునట్లు బ్రహ్మవిద్యా అర్హత అన్ని
ఆశ్రమములకు కలదనియు తగుప్రయత్నము చేసినయెడల
ముక్తినొందవచ్చునని తెలియవచ్చుచున్నది.

సమాప్తః.

---

# పద్మవ్యూహము

ఓసోదరులారా పూర్వము భాగవతములో అభిమన్యుడు
పద్మవ్యూహమున ప్రవేశించుటయు తదుపరి దుష్టబుద్ధిగల
దుర్యోధనాదులచే హతమాయెననియు వినవచ్చినది. గాన
ఇప్పుడు అసంగతి ఆత్మపరముగా గ్రహించబడునది. ఎట్లన
మొదట యుద్ధధర్మములన్నియు కృష్ణునిచే బోధింపబడిన
అర్జునుడు తిరుగా తన భార్యయగు సుభద్ర గర్భవతియై
యుండగా ఆమెకు తాను బోధించెననియు తెలియవచ్చు
చున్నది. యిందు శ్రీకృష్ణుడనగా శ్రీ యన జ్ఞానమనిన్ని
కృష్ణుడనగా ఉత్కృష్టపదార్థమనిన్ని అనగా జ్ఞానమే
ఉత్కృష్ట పదార్థమని భావము. ఇందుకు (శ్రు) జ్ఞానమే పర
రం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే. యిట్టి కృష్ణుడు వాచ్యా
ర్థమువలన సద్గురువనియు లక్ష్యార్థమువలన పరమాత్మ
యనియు చెప్పబడును. గాన జీవుడను అర్జునుడు ఇంద్రియ
వృత్తులతో యుద్ధము చేసి జయించుటకు తగు ధర్మములు

అనగా ధర్మార్థ కామమోక్షములను చతుర్విధపురుషార్థము
లలో యింద్రియములను జయించుటయే మొదటిదియగు
ముఖ్యధర్మముగావున అట్టి ధర్మమునే బోధించెను. తరు
వాత జీవాత్మకు ధర్మాధర్మ విచక్షణ తెలిసినను మనస్సును
బోధించనియెడల బంధహేతువగునని యిందుకు (శ్లో॥) మన
ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః బంధాయ
విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతం అనునట్లు మనస్సే
బంధమోక్షములకు హేతువుకావున మనసునకే బోధవర్చ
వలెను. ఇందుకొరకే అర్జునుడు సుభద్రకు యుద్ధధర్మములు
బోధించెనని తెలియవచ్చునది. సుభద్రయనగా (శ్లో॥) మనో
హి ద్వివిధం ప్రోక్తం శుద్ధంచ శుద్ధమేవచా అశుద్ధం కామసం
కల్పం శుద్ధం కామవివర్జితం అనునట్లు శుభమైనట్టి మోక్ష
పదవి భద్రబరమనదియే సుభద్రయనియు శుద్ధమనస్సనియు
చెప్పబడెను. ఒకానొకదినమున యేకాంతప్రదేశమున ఇట్లు
మనస్సుకు బోధించుచుండగా పద్మవ్యూహములో చొచ్చు
టయే బోధించెనుగాని తిరుగావచ్చుట బోధించకుండగనే
కృష్ణుడువచ్చి హేళనగా ఇట్లు పలికెను. యొల్లన ఆడవారికి
యుద్ధధర్మము లెందుకని పలుక అంతటితో ఆపుచేసెను.
అనగా మనస్సుహృదయపద్మమున చొచ్చువరకే బోధింప
వలయునుగాని తిరుగా బహిర్ముఖమగుమని బోధింప నవసరం
లేదు. గాన అంతటితో నిలుపుచేసెను. మనస్సు అంతర్ముఖ
మగుటలో శుద్ధమనియు, బహిర్ముఖమగుటలో మలినమనియు

అట్టి మలినమే చలనమునకు హేతువు. గాన ఆడేదానికి చెప్పే దేమి యని కృష్ణుడు హేళన చేసెను. అట్టి సుభద్ర గర్భమందు అభిమన్యుడు ఈధర్మములను వినెననగా జ్ఞాన స్వరూపుడగు సూత్రాత్మరూపమున సర్వము గ్రహించి యుండెను. తదుపరి బయటకు వచ్చెననగా మనస్సు నందలి విజ్ఞానం బోధవలన వికసించెనని భావము. తరువాత దుష్ట చతుష్టయం మగు దుర్యోధనాదులచే యుద్ధము ఏర్పరప బడినది. అనగా మనస్సును దుర్యోధనుడు బుద్ధియను దుశ్శా సనుడును చిత్తమను శకునియు అహంకారుడను కర్ణుడును అనగా మనస్సునే దుర్యోధనుడు యెట్లు సంకల్పించెనో బుద్ధి యను దుశ్శాసనుడు అట్లనే నిశ్చయించును. అనగా మనో సంకల్పము నిరోధించుటకు దుర్లభం గావున దుర్యోధను డనియు బుద్ధియొక్క నిశ్చయము అసత్యమగుట దుస్సాధ్యము కావున దుశ్శాసనుడనియు చిత్తమునకు చలనమే స్వభావము గావున శకునిరూపమున కలహము పెంచుచుండు ననియు కర్ణుడు అహంకారరూపమున అహంకరించుచుండెను. ఈనలు గురు ద్వారా యుద్ధ మేర్పర్చబడెననియు తెలియునది యీ దుర్వర్తులనే దుర్యోధనాదులు హృదయపద్మమనే పద్మ వ్యూహమున ఇరుప్రక్కల కాచుకొని యుండిరి. ఆవ్యూహ మునకు సప్తప్రాకారములు కలవనగా 1 అజ్ఞానము 2 ఆవ రణము 3 నిక్షేపము 4 పరోక్షజ్ఞానము 5 అపరోక్షజ్ఞానము 6 దుఃఖనివృత్తి 7 ఆనందప్రాప్తియను సప్తావస్తలే సప్తప్రాకా

రములుగా నెన్నబడును. అందు జ్ఞానస్వరూపుడగు అభిమ
న్యుడు యీసప్తఆవరణములు దాటుకొనిపోయి అందు దుర్యో
ధనుని పుత్రుడగు లక్ష్మణునితో కొంతవరకు యుద్ధముచేసి
యేకకాలమున వుభయులు మడిసిరి. అనగా లక్ష్యార్థం కొంత
వరకు అవసరం గావున లోన ప్రవేశించువరకు లక్ష్మణకుమారు
డుండెననియు వాచిక సంబంధమగు వృత్తులేవియు అభి
మన్యునితో లోన చేరుటకు వీలులేదనియు గ్రహించునది
అందుకొరకే తక్కిన సైన్యమంతయు బయట నిలచిపోయిరి.
తరువాత లక్షణావృత్తితో కొంతవరకు పాటుపడి తరువాత
అదియు తనయందు లయపరచుకొని తాను ఆనందప్రాప్తి
యను యేడవ అవస్థయందు నిలచిపోయెను. అంత దేహాభి
మానము నిశ్శేషముగా విడజననునట్లు శరీరం యుద్ధ
భూమియందు పడెను. (శ్లో॥) ఘటాకాశ మివాత్మానం
విలయం వేత్తి తత్వతః॥ సగచ్ఛతి నిరాలంబం జ్ఞానలోకాం
సమంతతః॥ యనునట్లు దేహం పరిత్యజించి తానుతానై
లేచిపోయెను. అంత పామరులు దేహమునే బాధించె
దరు గాని యిందుకు సాక్షియగు ఆత్మను బాధింపజాల
రైరి. ఇది ఇట్లుండ కృష్ణుడు అర్జునుని తురకలుండు స్థానము
నకు గొనిపోయి యుద్ధరూపముగా విడచెను. అనగా తర్క
వాదులనే తురకలలో జీవుడనే అర్జునుడు నిలచిపోయెను.
అంత ధర్మరాజాదులు అభిమన్యుని కాపాడుటకుగాను
వ్యూహములోనికి బోవుచుండగా సైంధవునిచే అటంకపడిరి.

యేమివల్లననగా యిచ్చట ధర్మలక్షణ మేదియన వ్యవహారధర్మములు పరమార్థమునకున్ను పరమార్థధర్మములు వ్యవహారమునకున్ను చెల్లవు గావున అట్టి జ్ఞానస్వరూపుడగు అభిమన్యుని రక్షింపలేరైరి. సైంధవుడనగా సందిగ్ధమగు ఒక వృత్తి. సందేహమనునది సముద్రమువలె అతిక్రమించుటకు అశక్యము గాన సైంధవుడని చెప్పబడెను. తరువాత వ్యవహారమునుబట్టి చూడగా ఇది కేవలమున్ను వ్యవహారధర్మమే కావున వీరిని లోన చొరనిచ్చుటకు ప్రమాదమనియు పరమార్థమును పట్టి చూడగా చాలా మోసముగా యుండును. అందుకొరకే సైంధవుడు అడ్డుపరచెను యెట్లన ఆనందప్రాప్తి యనే యేడవ అవస్థ చెందియుండిన జ్ఞానస్వరూపుడనే అభిమన్యుని భహిర్ముఖునిగా చేయరాదని భావము. అంతయుద్ధానంతరము ధర్మరాజు పట్టాభిషిక్తుడాయెననగా మనుష్యమాత్రులకు ధర్మాధర్మములే గోచరమగునుగాని అతీతమగు ఆత్మను దర్శించలేరు. గావున ప్రాపంచకమును ధర్మమే గౌరవింపబడును. అందుకొరకే ధర్మరాజునకు పట్టాభిషేక మాచరించిరి. తాను జీవన్ముక్తి విదేహముక్త్యాది పదవులనొంది పోయినను ప్రాపంచకమున తన తాలూకు ధర్మముయొక్క ఖ్యాతి చాలాకాలము నిలచును. తదుపరి అభిమన్యునికొరకు అర్జునుడు సోకించె ననగా జీవత్వమునకు ఆత్మత్వమును ఆత్మకు జీవత్వమున్ను గోచరించవుగావున వ్యవహారమునకు జీవత్వమే ముఖ్యముగావున అర్జునుడే నిల

చెనని భావము. అనగా పరమార్థదశయందు వ్యవహారమును వ్యవహారదశయందు పరమార్థమును గోచరముకావు. యేక కాలమందు రెండును నిలచుట అసంభవము. ఇందు కుదాహరణ రెండుభాషలు నేర్చినవాడు ఏకకాలమున రెండుభాషలు సంభాషించుట కెట్లు వీలులేదో ఒకదాని వెనుక నొకటి మాట్లాడునట్లు వొకఅవస్తవెనుక నొకయవస్త యనుభవింపబడును. అనగా వ్యవహారమునకు జీవుడే కర్తగావున అర్జునుడే నిలచిపోయెను. (శ్లో) ననిరోధానచో త్పత్తిర్నబంధో నచ సాధకః॥ నముముక్షుర్న వైముక్త ఇత్యేషా పరమార్థతః యనునట్లు అభిమన్యుడు తానుతానై నిలచిపోయెను. అభిమన్యుడు మరుగుపడినను అర్జునుడు యింతశోకము భరించి బ్రతికియుండుటకు కారణమేమనగా (శ్లో) ప్రారబ్ధం భోగతో నశ్యేత్ తత్వజ్ఞానే నసంచితం ఆగామిద్వివిధం ప్రోక్తం తద్వేషి ప్రియ పాదినః యనునట్లు ప్రారబ్ధము నతిక్రమించుటకు యెంతటివారికైనను శక్యముకాదు గావున జీవుడనే అర్జునుడు ప్రారబ్ధ మనుభవముకొరకే నిలచెను.

సమాప్తి.

## త్రిపురాసుర సంహారం

ఓ సోదరులారా పూర్వము భాగవతములో త్రిపురాసుర సంహారమును గురించి చెప్పబడియున్నది. అది లోకవిదితమేకదా ఇప్పుడు ఆకథను ఆత్మపరముగా మార్చుడ

మైనది. ఎట్లన ముగ్గురు రాక్షసులు బ్రహ్మనుగురించి ఘోరతపంబు చేసిరనియు ఇందులకు తాళజాలక దేవతలు బ్రహ్మను ప్రార్థింప బ్రహ్మ నయ్యసురులవద్దకు పోగా త్రిలోకములు తన స్వాధీనము చేయుమని ప్రార్థింప బ్రహ్మ అందు కొడంబడక వేరొకవర మడుగుటయు వారు త్రివిధ పురములను సృష్టించుకొని వచ్చి వీనికి చైతన్య మొసంగు మని చెప్ప బ్రహ్మ అట్లే చేసెను. తిరుగా ఇట్లు ప్రతీకారము కూడా చెప్పియుండెను. ఎట్లన త్రిపురములు ఏకస్థానమున చేరినప్పుడు మీకును పురములకును కీడు వాటిల్లునని చెప్ప నయ్యసురులు త్రిలోకములను త్రిపురములచే నాక్రమించి అందలి జనుల బాధించుచుండెను. అందుకు త్రిమూర్తులు ఏకమై అయ్యసురులను నెట్టకేలకు మట్టు అడంగించిరి. ఈ ప్రకారం కథరూపముగా తెలియవచ్చినది ఇప్పుడు నిజ మగు అర్థమేదియన త్రిగుణములు రక్కసులుగాను బ్రహ్మ యన మనస్సనియు. వారు హృదయమను అరణ్యమందు యింద్రియములచే అశాస్త్రీయ సంపాదనకై వేచియుండి రనియు ఇట్లుండ శాంతఘోరమూఢవృత్తులనే ధూమము పుద్రేకింప సుగుణములకు దుర్గుణములకు పుత్పత్తిస్థానము హృదయమే గనుక సుగుణములనే దేవతలు మనస్సను బ్రహ్మకడ కేగి యీపుపద్రవమును తెల్పగా తెలుప అంత నా బ్రహ్మ త్రిగుణములనే అసురులవద్ద కేగి మీ మీ అభిమతము లను తెలుపుమన నా యసురు లిట్లనిరి. స్వామి త్రిశరీరము

లనే త్రిలోకములను నా స్వాధీనమం దుంపుడన అంశులను
మనస్సను బ్రహ్మ వొడంబడక వేరొకవర మడుగమనుటయు
అంత న య్యసురులు అవివేకరూపుడగు మైయుని రావించి
మూడుపురములు సృష్టించి తేవలయునన వాడు త్రివిధా
వస్థలనే త్రిపురములను సృష్టించి అతివిచిత్రముగా తెచ్చి
ఇచ్చెను. వీనికే బాహ్యమున ఉక్కుపురమనియు కంచుపుర
మనియు వెండిపురమనియు చెప్పెదరు. ఇచ్చట అవిద్యతో
గూడుకొన్న సుషుప్తిఅవస్థయే ఉక్కుపురమనియు కల్పిత
ములతో కూడుకొన్న కంచుపురమే స్వప్నావస్థయనియు
జాగ్రదవస్థయే వెండిపురమనియు చెప్పబడును. అంత మన
స్సను బ్రహ్మ వానికి చైతన్యం కలగజేసెనగా తన సన్ని
ధానమాత్రమున జడమగు దేహేంద్రియములు చెల్లించు
నట్లు యీ పురములకును కదలిక కలిగినది. అంత నా త్రిగు
ణములనే అసురులు తమతమ పురములచే త్రిలోకములను
నాక్రమించి రనగా ఇదివరలో మనసనే బ్రహ్మవలన ప్రతీ
కారముగూడ పొందియుండిరిగాన వాక స్థానమున నిలువక
త్రిలోకముల నాక్రమించెను. అది యెట్లన త్రివిధావస్థల
మర్మము యేకకాలమున విచారణద్వారా యెన్నడెరుంగ
బడునో అప్పుడు గుణసహితమగు అవస్థలకు నాశము కలు
గును. అనగా ఇందుకు (శ్రు) యేకయే వాత్మమంతస్థ్యా
జాగ్రస్వప్న సుషుప్తిషు స్థానత్రయో వ్యతీతస్య పునర్జన్మనే
న్నవిద్యతే॥ యనగా యేకమగు నాత్మ జాగ్రస్వప్నసుషుప్త్యా

దులయందు నిండియున్నదనియు ఈ జాగ్రతాదులు మిథ్య యనియు ఈ స్థానత్రయాదులకు అతీతుడు ఆత్మయనియు యెవడెరుంగుచున్నాడో వానికి పునరావృత్తిలేదని స్మృతి చెప్పుచున్నది. గాన అట్టి విచారణజ్ఞానం కలిగినపుడే దీనికి నాశనమని తెలియుచున్నది. ఇట్లగుటకు కారణమేదియన సుద్ధాసుద్ధవృత్తులు కలుగుటకును అనగా ఇహవాంఛగాని పరవాంఛగాని కలిగినచో హృదయమందే కలుగవలయును. అచ్చటకు మనస్సు చేరి విచారించుకొనవలయును. ఇందు కొరకే దుర్గుణములను రాక్షసులు హృదయమును అరణ్యమున ఇహవాంఛకొరకు తప్పించుచుండ కంటస్తాన మనే బ్రహ్మలోకమునందు మనస్సనే బ్రహ్మ హృదయమనే అరణ్యమునకు వచ్చి వీరితో విచారించెనని తెలియునది తదుపరి త్రిగుణము లనువారు స్వర్గమత్యపాతాళములను త్రిశరీరముల యందు త్రిఅవస్త లనే త్రిపురములను ఆక్రమించి అచ్చట వారలను బాధించుచుండి రనగా ఆత్మానాత్మ వివేకము యెరుంగుటకు వీలులేకుండా త్రిఅవస్తలచేతను మరుగుపరచి బాధించుచుండ సుద్ధవృత్తులను దేవతులును మహానులను మునులును మనస్సను బ్రహ్మయొద్దకు నేగి తమ యిడుముల నెరింగింప మనస్సను బ్రహ్మ సుద్ధసత్వమను విష్ణువు నేకీభవించి సర్వజ్ఞుడగు ఈశ్వరుడును ముగ్గురును నేకీభవించి ఇట్లు యోచించిరి. యట్లన మనయుభయులశక్తి యేకత్వము చెందించినగాని అనగా సమిష్టి చెందినగాని వ్యష్టిగా నుండు

వరకు దుర్వృత్తులను రాక్షసులకు ఇహవాంఛయనే తపస్సు చాలింపరైరి. గాన అట్లు చేయవలయునని యోచించుకొనిరి. యిందుకు (శ్రు) ఆత్మానం రథినం విద్ధిశరీరం రథమే వచ బుద్ధింతు సారథింవిద్ధి మనః ప్రగహమేవచ ఇంద్రియాణిహయానాహు ర్విషాయాన్ స్తేషుగోచరహ జంగమాని విమానానిహృదయాని మనీషిణః యనునట్లు సుద్ధవృత్తులను దేవతులు గుఱ్ఱములుగాను మనస్సును బ్రహ్మ రథముగాను తానె పరమేశ్వర్డు రథికుడుగాను అనగా మాయాశక్తి తనలో కొంతభాగము శుద్ధముగాను కొంత భాగము మలినముగాను యున్నదిగాన మలినమనగా స్వచ్ఛము కానిదనియు సుద్ధమనగా స్వచ్ఛమనియు చెప్పబడును. గాన అట్టి మలినశక్తిచే శరీరమును సుద్ధశక్తిచే మనస్సును ఏర్పడినవిగాన ఇట్లు చెప్పబడెను. తరువాత సుద్ధసత్వప్రధానమగు బుద్ధియే విష్ణురూపమున పరమేశ్వరుని చేతియందు ఆయుధరూపముగా నిలచెను. దీనికే బాహ్యమున ఈశ్వరుడు పాసుపతాస్త్రము ప్రయోగించిన త్రిపురములు వకదగ్గరచేరీ రక్కసులసహితముగా మడసిరని చెప్పిరి. ఇచ్చట విచారణ జ్ఞానమనే హస్త్రమును ప్రయోగించ త్రివిధావస్తల మర్మము తెలియబడుటతోడనే దుర్వృత్తులు అవస్తలసహితముగా నసించి సుద్ధవృత్తులనే దేవతలకు సుఖముకలిగెనని అనగా స్వరూపానుసంధానము చేయుటకు అవకాశము చిక్కెను.

సంపూర్ణము.

# దండకం

శ్రీమన్మహా మేరు ధీరా మహత్త్వాది మూరామాయా ప్రపంచాది మలిన వాసనల్ ద్రుంచి మాయాఘారులైనట్టి ఈజీవులన్ బట్టి ఏకాగ్రమైనట్టి నీసత్ కృపాదృష్టి చేపట్టి భవ బంధముల్ ద్రుంచి భావించి దీవించి పాలించి నాలించి లాలించవే గాఢమగునట్టి యజ్ఞాన కార్యంబులన్ ద్రుంచి ధైర్యమొందించి కాపాడుచున్నట్టి కామేశ్వరాంబా ఓంకార రూప నీదు యానందమైనట్టి యాదృష్టిచేబట్టి ఈదుష్ట జీవు లన్ బట్టి సద్గోష్టిలో బెట్టి భవభయం బోగొట్టి భావాభావం బులన్ దిట్టి యాశపాశంబులన్ జుట్టి ఘోర మోహాంధ కారంబు లైనట్టి సంసారమున బెట్టి అహర్నిశంబులున్ లేక బాధించుచున్నట్టి మాయాభ్రాంతులన్ గొట్టవే నీదుచేబట్టవే మాయబోగొట్టవే నీదు మహావీర్యమైనట్టి వ్యక్తిచే యుక్తిచే భక్తిచే రక్తిచే శక్తిచే ముక్తి గల్గించి మూలముం ద్రుంచి ముప్పైటిలో ముంచి మూడింటి మీరించి యారింటి రోసించి ఏడింట దాటించి యారింట ఛేదించి యాముక్తికాంతా సమాగంబుగావించి యానందమొందించి యరుకమరుపులన్ ద్రుంచి యాభాగ్యమందించవే నాయధాశక్తిచే నీదుపాదంబు లన్ బట్టితిన్ పరముచేబట్టితిన్ కాయక్లేశంబులన్ గొట్టితిన్ కామమున్ మట్టితిన్ కరుణాంతరంగా భవత్తారణాంగా సదా సేవితాంగా కుమారాంతరంగా భక్తాంతరంగా నీదు సత్కీర్తి వర్ణించ నేనెంతదాన్ రావే మాయమ్మ యోయమ్మ యోబొమ్మ

సేవించెదర౯ భావించెదర౯ గావించెదర౯ భక్తబృందావనా సాధుసంధావనా యోగబంధాజనా జ్ఞానవిజ్ఞానసుజ్ఞానప్రజ్ఞాన ధారీ వివేకాదిమాలాధరీ సురాసేవితారీ ప్రమాదాదిదూరీ సదానందధారీ విదారీ నమస్తే నమస్తే నమస్తే నమః

సంపూర్ణం

---

# 1. తత్వము

(తగినవరుడూ కాడె నీకు అనుమాదిరి)

ఎట్లు జగతీపుట్టెనమ్మా యెరుకకాయ వే। యేకమైనా పదవి దెలిపిన యెరిగివుండెదా ॥యె॥ బ్రహ్మమీనా జగత్తానీ భ్రాంతినొందితీ। బాహుబలిమీ తోడనాకు బోధకాయవే ॥యె॥ బ్రహ్మమే ఈజగత్తైతే భ్రాంతిచేతనూ। ప్రకృతీబ్రహ్మలకు వేరే పేరుయేలనే॥యె॥ దృశ్యరూపమును గనినాదుఃఖ మొదవనే। ద్రూఢమగుమార్గంబుదెలపి దరికిచేర్చవే ॥యె॥ వాసనాత్రయములకు నేనూ వశమైయుంటినే। వాదబేధా మూలు లేని దారిజూపవే ॥యె॥ ఖండరూపామునుగాని గాధ నొందితీ। అఖండరూపాముసు జూపీ ఆదరించవే॥యె॥ పాప పుణ్యాములులేని పదవి యెట్టిదో। బోధచేసే బాగుగానా భవము బాపవే ॥యె॥ ధరణిలోనూ కాంతలానూ కరుణ నేలినా। కామాంబా దేవిమమ్మా కడకుజేర్చుమా॥యె॥

# 2. తత్త్వము

(తగినవరుడూ కాడెనీకు అనుమూదిరి)

అక్కరో నీవడుగుప్రశ్నకు ముఖ్యముగ ఉత్తరవునూ। చక్కగా దెల్పెదనుమనసుకు గోచరంబైనంతయూ॥అ॥ బ్రహ్మా మందున ప్రకృతియెట్లు జనించెనని నీవడిగెదా। యేమనసా మాయనుచు శృతులు యెన్నుటయు నీవెరుగవా ॥అ॥ పంచ భూతము లెరుకగూడి ప్రపంచవ్యాపకమాయెగా। యెంచి చూచిన హెచ్చుతక్కువ లెచటలేకనుపోయెగా ॥అ॥ ఘట్టిగిట్టూచున్నదనచును ఇట్టి సంశయమేలనూ। గట్టిగా భ్రమయెట్లుపోవునో అట్టి యోచనసేయుమా॥అ॥ హెచ్చుతక్కువలిట్టివేయని యెన్నగను నీకేటికీ। హెచ్చుతక్కువ లెంచి చూచిన యేకమేయని తెలియుమా॥అ॥ శాస్త్రవాసన లోకవాసన చిక్కులవినీకేలనూ। దేహవాసనతోడ నన్నియు తీరిపొయ్యేవేసుమీ॥ అ॥ ముజ్జగంబులు ప్రణవమేయని ముఖ్యముగ నీవెరుగుమీ। ప్రణవమే పంచాక్షరంబని భావమందున నిల్పుమీ॥అ॥ ఖండ ఖండముగాకనంతట నిండినది పరిపూర్ణ మూ।ఎండమావులవంటివీ బ్రహ్మాండ భాండములన్నియూ అ॥ వున్నపరిపూర్ణంబు చూచి వుత్సాహతోనీవుండుమా। సన్నుతింపుచు శాంతినొందియు సత్యమిదియని నమ్ముమా॥ అ॥ ఉన్నదెప్పుడు అంతటను నిండున్నదే పరిపూర్ణమా। తాను జగమును మిథ్యయనుచును తలచుచుండుట యోగమూ॥ అ॥

ఇంతకంటే పరమయోగము యెక్కువేమియు లేదనీ। చింత లన్నియు మానియప్పుడు చిత్తమందున నిల్పుమీ॥ అ॥ బ్రహ్మసృష్టియు విష్ణుస్థితియును శివుడు లయమను మాట లూ। సర్వమూ మిథ్యనుచు నీమది సంశయంబూ మానుమా॥ అ॥ తెలుగుమాటలు గాన సంస్కృతపదమూ లేమీ యెరు గనూ। సత్యమిది నేనమ్మియున్నా సఖియ నీకిది దెల్పితీ॥ అ॥ యెరిగియెరుగని మాట లివియని యేమొ తెలిపితిననకనూ। తప్పులేమీ యున్నవన్నియు వొప్పులుగ భావింపుమా॥ అ॥

# 3 కీర్తన

దేశకవర్యాస్వామీ భవనాశము దెల్పవ దేమీ। భార మయ్యె నీతనువూ భూమీపాలు జేసెద వేమీ॥ దే॥ ఏమో అడిగితిననకా నాదీనతగాచిన వెనుకా। తిరిగిజననములున్నవి యనకా తిరిగిచూడనా వెనుకా॥ దే॥ పాపము జేసితిననకా నీపాలికివచ్చితిగనుకా।నాపాపము పరిహరించినవెనుక పరము జేరెదా వెనుకా॥ దే॥ ముగ్గురుమూగావారూ మొదటికిమోస ము చేసినారూ। మూటినివిడచే మార్గముదెలపి ముప్పిరిగను మీరూ॥ దే॥ మూటిలో ముంపారయ్యా నే ముందుకు తిరుగా నయ్యా। మూటినివిడచే మూటిలోమునిగే ముదముచూప రయ్యా॥ దే॥ సాధనలేమీ స్వామీ సందేహము తెల్పవ దేమీ। సతతము మీపాదమునమ్మి సౌఖ్యమందెదా నేమీ॥ దే॥ ధీనులబ్రోవగరాదా మాకు ధైర్యముఉన్నదికాదా।

దీక్షతోడమీా దరికీ జేరెద ధన్యునిసేయరా దా॥ దే॥వంటరిగా నే యుంటే ఇక తంటాలేమీాయంటే। కంటిలోనుండే ఘనునీ గంటే కరువుదీరెనంటే। దే॥ కామాంబారోనీవూ నా కామ హారణమూసేయూ। కర్త కర్మ క్రియలా వివరము ఘనముగ మాకు దెల్పూ॥ దే॥

## 4 కీర్తన

యేమేఅబలా మనమూ అహామాదినివిడుచుట ఘన మూ। ఆదిఅంతమూ లేనటువంటీ హారినిగను జె ఓఫలమూ॥ యే॥ చూచెటిజగతీ నీకూ బల్ చీకటిగాచూ కడకూ। భావ మందునా పదిలాపరచుము పరాకుయేలా మనకూ॥ యే॥ ఆధారంబున పుట్టీ ఆ అతివలతో గలసుంటే। ఆరోఅంచీ అదియే తెలుపును అదగియుండకట్టీ॥ యే॥ సోహాంబనుచును నీవూ పరసౌఖ్యము గను టేమేలూ। సోక మోహాములు దిగ నాడితే సౌఖ్యమందగావీలూ॥ ఏ॥ ఒడలు శుద్ధిజేసీ ఓంకారం బును తెలసీ। ఒడలుమరచుచూ ఓహోయనుచూ ఒక్కపద విగనుచూ॥ యే॥సప్తమెలికలున్నా ఆసఖియను గలసికొన్నా। సాటిలేనియూ బాటదెల్పును సంతతముగనున్నా॥ యే॥ వేచిన గింజలవలెనూ భవవాసనలన్నీ విడుమూ। వాసిగానుయీా వైరివర్గమును వశముచేసికొనుమూ॥ యే॥ యేడింటినీవిడకూ నిల యైదింటీనీ గనకూ। యైదు ఐదు యిరువైఐదింటితో ఆట లేమిమనకూ॥ యే॥ మనమూత్రములాగూనా ఇది మరణ

జననములబానా। మర్మము తెలసిన మహానీయులను మహ
త్తైన ఘాయిఖానా॥యే॥ సంచితములకూ షాపూ బహుసంక
టములకూ టోకూ। సాక్షినిగనినా సచ్చరిత్రులను సౌఖ్యము
వనునూ పూటూ॥ యే॥ కామాంబారోనీవూ నాకలుషము
లన్నిబాపూ। కాంతిమీర నీకడకూ చేర్చుకు కైవల్యంబును
జూపూ॥ యే॥

## 5 కీర్తన

(కృష్ణుని భజియింపు మాదిరి)

సద్గురునిస్మరియింపు మానాసా। సంశయములనువిడి॥
సా॥ సద్గురునీ స్మరణా జేసీ। సాక్షిని నీలోనగాచి। సంతాతము
సామాధిసిష్ట సంగతీదెలసీ। సాధానచతుష్టయము స్వంతా
మూగసంపాదించీ। సాధూసజ్జన హితులాగూడి। సహస్రా
రావాసియగుశ్రీ॥ సా॥ యెన్నారానీ దేహముల గ్రన్నాన
నీవెత్తుచూను। ఖర్మరహితా మైనయట్టి। ఘనునీగానావూ।
కఠినామార్గమునూవీడి। కాలూనిమాయాను జేడీ। కాలాతీతు
లైనమట్టి కారుణ్యానిధియైనశ్రీహరి॥ సా॥ దేహామనే దేవా
లయమున। దేవా। దేవునిగానాలేకా। దారీతప్పీ యిటులా
నీవూ। తిరుగానేటికే। ధాతాద్వైవంబుయానీ। దానావాంతకు
దరికీజేరా। తాపత్రయమూ 'వీడీవేగా। తరుణము మించక
మునుపె॥ సా॥ సత్తూచిత్తూల రెంటిలో సాక్షీనిగానంగలేకా।
సాకారభ్రాంతులయందు। సమయమేటీకే। సాధానవంపత్తి
తోడ। పచ్చక్రకవీధిని నీవూ। సాటిలేని సౌఖ్యామునూ సంత

శాము నల్పుచుందుము॥ సా॥ నానా భేధాములవులోనై।
వేదాతీతుని గానలేక। వేవేలా విధములచే వెతుకా వేలానే।
వేదామూలామైనాయట్టి నాదబ్రహ్మను గామగోని। నాది
నీదను భేధామంతా। మోదాముగ విడువుమింక॥ సా॥ ధర
ణీలో జీవులాకు తాపత్రయమూలద్రుంచీ। తన్స్వరూపమును
దెల్పిన। సాక్షిభూతూని। అక్షయముగా కుక్షినిలిపి। పక్షా
పాతమూనువీడి। కాంక్ష లెల్లా వడకుజిమ్మిన। ఖర్మరహితము
గాంచగలవు॥ సా॥ వాసిగా చోడవరపురమూనందూ వెలసి
యున్నా। వందనీయూలైనయట్టి మందగమనని। డెందా
మూనా నిలుపుకోనీ। నందియుంబూ లెల్లావీడి। కందర్ప
సుందారీయగు కామాంబా గురుదరికి జేరి॥ సా॥

## 6 కీర్తన

శ్రీ దేశ కేంద్రధీరా। ధరనిరుపమునిర్గుణశీలా। దానాపు
లందరీని। మానావులూగ జేసీ। మానాభిమానములు టూటూ
పరచీనయట్టి॥ శ్రీ॥ ఫాలాభాగమునందు నిలచీ। భవబంధా
ముల నెల్లద్రుంచీ। గంగగాయమునూలనుధ్యనంగాతిగమగావి।
చెలంగీ। మునింగీ। సుష్పాంగూంచు నుండునట్టి॥ శ్రీ॥ వాంటి
స్తంభపు మేడలోనూ। ఓంకారా సింహాసనమునందూ। భక్తి
రత్నలను భామాలతో గూడి। భాసూరముగనున్న భోదా
స్వరూపా॥ శ్రీ॥ వైరాగ్య భోదాపరతులూ। యమువనితాలు
ప్రచారించా। వాసీగనీవరా। సూకాముసందున। పంచాన

లేకను వర్తించువాడవు॥ శ్రీ॥ సూర్యాచంద్రాలను వారిని।
నీకు సూటిగ నుగటిలో విధా। సుజ్ఞానపు నెడికాంతా। సుందా
రముగవచ్చి సుషుమ్నయనుతలుపు సూక్ష్మముగనుదీసె॥
శ్రీ॥ సంయోగమనియెటికాంతా। అది సరగూనవచ్చియు
వినూ్న। సంతోషముగతప। సందీటజేస్చికొని సంసర్గమని
యెటి సహస్రారమునసుంచె॥ శ్రీ॥ ఆనందమనియెటి పాన్పు।
అది అమరించి ఆపైనినూ్న। ఆధారాది షాడ్చక్రములా
పైని। లాలన సేయుచు జోలాలుపాడెను॥ శ్రీ॥ దశవిధ భేరి
లెల్లా। నల్దిశలెల్ల గ్రమ్మకునుండా। నాదాబిందుకళా। తీతా
మునానీవ్రా నాటావినోదమున। నటియించుచుంటివి॥ శ్రీ॥
వాసీగచోడావారా। పురవరమూన పెలసియున్నా। కామేశ్వ
రాంబా। కలుషసంహారి। కాపాడిరక్షించు కరుణాంతరంగా॥
శ్రీ॥

## 7 కీర్తన

(వెతుకరో జీవా వెతుకరా అనుమోదిరి)

మొద్దురా శుద్ధా మొద్దురా। ఓజీవా ఇదివ॥ మొ॥ మొద్దు
యిదివ మొద్దాయెదివ। సుద్ధమిది యాబద్ధమిదియే। సూటిగా
శృంగాటకంబున। సూచనంతయు తెలియుపరకు॥ మొ॥ అబ్బ
ఈ మోక్షమబ్బురా। దీనినిబట్టా॥ అ॥ ఆదిఅంతా యీను
నిండి। ఆవరించుకొనిదియె యున్నది। హంసోహం బనుచుదీని।
అల్లరంతా అణచవలెను॥ మొ॥ మహానియమాలైనవారా।
మమర్మమెరిగీ మట్టి బెట్టి మౌనమూగా నుండివారరా। మున్న

నాలందీరిగావ॥ తొ॥ అధోముఖమూగాను యుండి। అజ్ఞాన
ము నెడిగడ్డి ఆధారము చేసుకుని। అనుభవిస్తూయున్నయిది దే॥
తొ॥ విషాద్యమూ ఖర్మమూనూ। వస్నెత్రాదూ తోడదీసి
నిరువుగా నిటలాగ్రముందున। నిలువ కెట్టియుండవలెను॥ తొ।
గంగయమునలలోను సంగాస్నానమూ చేయించిడీని। రంగు
గానూ రాజయోగ। మూర్ధమున ముల్పించుచుండును॥ తొ॥
దశవిధానాదంబు లనికొటి ఘనముగా ఘంటలను గట్టి।
గానమూచేయించిడీనిని। ఘనులకడకూ చేర్చవలెనూ॥ తొ॥
భక్తిజ్ఞానంబుగను వీనితో। భజనజేసి వట్నమిల్లా। త్రిప్పి
త్రవణావనవనమూనే। మందిగడ్డి మేరుపోయుము॥ ॥తొ॥ ధర
ణిలో కామాంబగురుని। ధన్యుని చరణములగట్టితే। తప్ప
కను ఈజననమరణా। జాడ్యమూ మాన్పంగగలరూ॥ ,తొ॥

## 8. కీర్తన

(ఎక్కాడా కనపడకూ యాదుపలా నందనుడు పాడిరి.)

సాధూ సజ్జనూలారా సద్గురుని బోధవూ। సాటేయుం
దున లేదుగా। ముజ్జగంబులు మనమూ తర్జూమూ చేసినా।
నౌజ్జలునిమించిన పజ్జాగనమైలేదిరా॥ సా॥ ఇంద్రియార్ధము
లందూ పరమార్ధముండానీ। అపార్ధముగమండినా। అర్ధమం
దయూచూడా। అనర్ధహేతువని మోహార్ధాముడు దెల్పి
పునరుద్ధరించేనూ॥సా॥ అంగావాహోమదిా సంగాతినెరుగా కా
కుంగూచూ నుండాగనూ। గంగా యమునలమధ్య సంగతం

తెయు జెల్పి! లింగభంగముచేసి రంగానాధుని మహిమ ॥సా॥
అజ్ఞానమునమునమూ ప్రజ్ఞామాలీయుండా! సుజ్ఞాన రూపము
నా జ్ఞానా పీజ్ఞానామూ! సౌజ్ఞనంతయు దెల్పి భవభంగ
మొనరించె! సాంధీపుని ఇలలో ॥సా॥ మహాజాదీ తాత్వ
ములా మహిమానూ గనలేకా! మాయాలో మసలాగనూ
మూతాయగుకామాంబా! మర్మామెల్లను దెల్పిమమతాయు
విడపించె మగువలందరికెల్లా॥ సా॥

## 9. కీర్తన

(ధీధీనీకీూ తగ దేవదినా మూదిరి రెట్టించి పాడెద)

యేమిూ ఈభక్తూల మహిమెంతా నిన్నే వర్ణింతునూ
సాహస్రజిహ్వాలూగలా ఆదిశేషూనీకైనా॥ యే॥ జగతి
ను ద్భవించీనపుడే జేడత్వము ను చేరానీకా! జాగన్నాధూనీ
తమలో ధ్యానించుచూవచ్చినారూ॥ యే॥ బాలూత్రాగూ
నప్పూడైనా పహ్వాలించూ సమయాముసా! పరమాత్మనీ
మనమానమూ భజీయించుచూనే యుండిరీ॥ యే॥ దినదిన
ప్రావర్ధమానూలగుచూ వచ్చూతరనీపిరూ! దీనారాతుకు
నీయెడా ధీరతగా నిలచీనారూ॥ యే॥ భక్తీని పరిశోధించిన
ప్రహలాదునీ మించీనరూ! సత్యామునూ గనినాగానీ
నకూ ఖాయిూ చాలాదా యే॥ యే॥ పాతివ్రతా మహిమా
కునూ పణతీ సావిత్రీవలెనూ! ధైర్యస్థైర్యామూలూగనా
దమయంతిగా దలచావలసే॥ యే॥ త్యాగాబుద్ధి సోధించినా

చంద్రామతీ చాలాదా యే! హంసామంత్రా మనుభవముకూ ఆహల్యనూ మించినారూ॥ యే॥ గురుతూనిలచే కొరకూ వీరూ గురువ్రూలనూ చేరేగానీ! గుణరహితమూగా జూచినా గురోర్గురూవ్రూ లేమూకూ॥ యే॥ వ్యసహారమందైనాగానీ వ్యష్టీభావామూనూవీడీ! కష్టానిష్టూర్యములకూ కలతాచం దారాహారయేమిరా॥ యే॥ భక్తీజ్ఞానా వైరాగ్యమూ వదీలా ముగా సాధించుచూ !పారోక్షపాకోక్షాముగా భద్రాముగా నిలచీనారూ॥ యే॥ ఆశాలేనీ గురువ్రూలనా అర్ధమేమొ తెలి యూదా యే॥ లోభత్వమూ లేనీ శిష్యులలో తంతయూ తెలి యూవచ్చే॥ యే॥

## 10. కీర్తన

(వియ్యాపురాలా ఓవయ్యారిలోలా నీవయ్యారము చాలునే మాదిరి.)

మాయాజీవానన్నూ మరుగూపరచీ నీవు మసలా గలవా జగతిలో॥ఓ॥మా॥ మాయామందులుచాల మత్తూగ నీకిచ్చీ! మరలూకొంటీరా నిన్నూ॥ఓ॥ ఈనాటినుంచీయు నామాట వినకుండీ ఇహామూదు విడచుట న్యాయమా! ఇన కాశి మండాల మూవాల కేగితె ఇపుడేనిను విడచేదమా॥ఓ॥ వంధ్యాపుత్రావాతువంటీ దానిగ నేను వర్ధిల్లుచుంటీవిరా! వాచాజ్ఞానము విడచి మసలూచుంటీ వేని వసితేయుంటి చూడరా॥ ఓ॥ కాలత్రయమూలందు ఘనమైన పదవీని గను

గోపురమంటే చేసి, సాక్షాత్తి కన్యాంకాను విడనీపోదు ఘన
మూన కనిపెట్టరా॥ ఓ॥ భావాతీతామైన బోధాను గను
గొంటె పోదూను వాయూరికి। పొట్టానిండానీకు పుట్టేదు
భ్రమలున్న పట్టూపడ నేనాటికి॥ ఓ॥ త్రివిధాప్రాసాదాముల్
స్థిరమూగ భుజియించి। తీవ్రాముగానుంటివా తదుప్రా
కాయకనాదు తల్లూలతోగూడి తిరిగి చూడక నేగదా॥ ఓ॥
ధరణిలో కామాంబ దరికి చేరి వేగ ధైర్యాముగానుండుమా।
తంటాలమార్తైతె తాపాము నీకేలా తదుప్రాకాయక
నేగుమా॥ ఓ॥

## ప్రశ్నోత్తరములు.

శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యనిర్మల స్వరూపులగు
సద్గురుచెంత సశిష్యుడు మెల్లన చేరి అనగా సాధనసంపత్తి
యుతుండును శమదమాది గుణసహితుండునునగు శిష్యుండు
సద్గురుని చెంతకు మెల్లన చేరి సాష్టాంగదండప్రణామంబు లాచ
రించి నిలచిన అందుకువారు ఆశీర్వదించి వాత్సల్యంబున
లాలించి బిడ్డా నీయభీష్టంబు నడుగుమన అందుకు శిష్యుండు
పరమానందంబునంది ఇట్లనియె స్వామీ నామనంబునందుగల
కొన్ని సందియంబులను దీర్చ వేడెదనన సద్గురు వల్లెయని
చేరదీసి యడుగుమన శిష్యుం డిట్లనియె.

1 (ప్రశ్న) స్వామీ సంధ్యావందనమే పురుషులకు
ముఖ్యకర్తవ్యంబని శాస్త్రజ్ఞులగు పెద్దలు నుడువుదురు. దాని

నిజమగు అర్ధమేమి. (గు) (ఉ) వత్సా నీవంటి అంతరంగ భక్తులకే ఇట్టినిజం తెలుపవలెను. అని ఇట్లు చెప్పనారంభించెను. సంధియన సంశయమనిన్నీ అదియెట్లన మనము చేసే వందన మెవరు అందుకొనియెదరు. అనగా తనకు మించిన దైవమనునది లేదనిభావము. రెండవది సయన సత్పదార్థము తెలియవలెనంటే ధ్యానసమాధులు ముఖ్యమనియు అందు గల్గిన ఆనందమునకుగాను సద్గురువుని నభినందించుటయే సంధ్యావందన మనబడును.

2 (ప్రశ్న) నాథా దేహమే దేవాలయమనియు అందుంగల జీవుడే దేముడనియు చెప్పుటయెట్లు. (ఉ)మన శ్శే నందియనియు ఆనంది కొమ్ములమధ్యనుండి ఈశ్వరుని దర్శించెననగా తమ నేత్రములే మనస్సను నందికి కొమ్ములనియు ఆరెండు నేత్రముల మధ్యనుండి సహస్రారవాసియగు ఆత్మను దర్శించెనని భావము.

3 (ప్రశ్న) స్వామీ త్రివిధప్రదక్షిణము లేల చేయవలెను. (ఉ) స్థూలసూక్ష్మకారణములనే ప్రాకారములను సాక్ష్యాకారక అవస్థలద్వారా చుట్టివచ్చి నాలుగవది యగు తురీయావస్థయనే గర్భాలయములో ప్రవేశింపుమనుట.

4 (ప్రశ్న) ప్రదక్షిణమన నేమి. (ఉ) ప్రయనప్రకృతి దక్షిణ ముఖముగా మనోరూపకమగు కుండలీశక్తిగా యున్నదిగాన ఊర్ధ్వకుండలిగా సేయుమనుట.

5 (ప్రశ్న) ఖండేశ్వరుడన నేమి. (ఉ) సమస్త విషయములను ఖండించిన జీవాత్మయే ధ్యానమాదులు సలుపుటకు గాను రహస్యప్రదేశము నాశ్రయించెను.

6 (ప్రశ్న) బాధా సోమసూత్రమన నేమి. (ఉ) నిత్యం సోహం సోహంబని పలుకుచున్నదే సోమసూత్రమనియు దానియందు నే దృష్టి అహర్నిశాదులు నిలుపుమనియు అది దాటి రావలదనియు అది అతిక్రమించినయెడల దృష్టి బహిర్గతమై విషయములకు లోబడునని భావము.

7 (ప్రశ్న) దేవుని యర్చించుటకు పంచపాత్రయనియు ఉద్ధరణయనియు యథావిధిగా నేలయుంచవలయును (ఉ) పంచపాత్రయన పంచభూతాత్మకమగు ఈ దేహమే పాత్రయనియు ఉద్ధరణియన తనను ఉద్ధరించునది అరణిగావున ఉద్ధరణయనియు ఇందుకు (శ్రు) ఆత్మానమరణిం కృత్వా ప్రణవంచోత్తరారణిం ధ్యాన నిర్మథనాభ్యాసా దేవంపశ్యే న్నిగూఢవత్.

8 (ప్రశ్న) సూర్యగ్రహణమన నేమి. (ఉ) చక్షువునకు సూర్యుడధిదేవతగానా విక్షేపశక్తిద్వారా నామరూప భ్రాంతి కలుగుటయే గ్రహణము.

9 (ప్రశ్న) చంద్రగ్రహణమన నేమి. (ఉ) మనసునకు చంద్రుడధిదేవతగాన ఆవరణశక్తిద్వారా తన స్వరూపము మరుగుపడుటయే చంద్రగ్రహణము.

(10) (ప్రశ్న) గ్రహణము పట్టుటతోడనే స్నాన మాచరించుట యెందులకు. (ఉ) యిట్టి ఆవరణ విక్షేప శక్తులుద్వారా స్వస్వరూపము మరుగుపడుటచే పంచవింశతీ తత్వములయొక్క స్నానాదులను తెలియుటయుఅనగా సాంఖ్య విచారణచేయుట అనగా (శ్రు) స్నానం మనోమలత్యాగా శౌచమింద్రియ నిగ్రహః యనునట్లు గ్రహించునది.

11 (ప్రశ్న) అన్నిటియందు దర్భ చేర్చుట ఎందులకు. (ఉ) జ్ఞానియైనవానికి పుణ్యాఖర్మలు తృణప్రాయములుగా ఉం డునుగావున అది కలుగకపూర్వము ఈఖర్మలద్వారా చిత్త శుద్ధి కావలయును. అందుకొరకే పుణ్యాకర్మలను దర్భ అన్ని యింద్రియములందు చేర్చమనుట ఈదర్భగ్రాణానంతరమున తీసివేయమని చెప్పుచుండిరి. ఇందుకొరకే జ్ఞానికి కర్మలతో నిమిత్తము లేదనుట. (శ్రు) ఉత్తమో తత్వచింతాచా మధ్యమా శాస్త్రచింతనం అధమా మంత్రచింతాచా తీర్థ భ్రాంత్యాధమా ధమః॥

12 (ప్రశ్న) గర్భిణి స్త్రీలు గ్రాణము చూడరాదన నేమి. (ఉ) అనగా జ్ఞానమనునది వికసించకపూర్వము ఆవ రణ విక్షేపసహితులగు వారితో సాంగత్యము చేసినయెడల అనగా అభ్యాసకుడు జ్ఞానదీక్ష పొందియుండునుగాన జ్ఞాన పుత్రుడు గర్భస్తమగునపుడు స్వేచ్ఛాచారుడై యుండిన యెడల యోగజ్ఞానములయొక్క స్వరూపము పూర్ణంగా

తెలియదుగావున జ్ఞానమును పుత్రునకు అంతయు లోపము గానే యుండును.

13 (ప్రశ్న) జడమనియు చైతన్యమన నేమి. (ఉ) ముకిళీభావమే జడమనియును వికసించుటయే చైతన్యమనియు ఇందుకు పక్షిపిల్ల దృష్టాంతము గ్రుడ్డుయం దుండుటయు బైటకు వచ్చుటయు జడచైతన్యములకు దృష్టాంతము.

14 (ప్రశ్న) స్వామీ పంచమహాపాతకములన నేమి. (ఉ) అణవాది పంచమలములే పంచమహాపాతకములు.

15 (ప్రశ్న) పూర్వులు సహగమనం చేసిరన నేమి. (ఉ) స అనగా శక్తిబీజమనిన్నీ హ అన శివబీజ మనిన్నీ గమనం అన శక్తిరూపమునకుండు మనస్సును శివరూపముగానుండు పరమాత్మలోనికి చేరుమనుటయే సహగమన మనబడును.

16 (ప్రశ్న) నవనీతచోరుడన నేమి. (ఉ) నవ అన నవవిధభక్తులచేతా నియమింపబడిన మనస్సును ఆత్మడను కృష్ణుడు హరించెనని భావము.

17 (ప్రశ్న) కౌసల్య అన నేమి. (ఉ) జ్ఞానమునకు కౌమారావస్థ కలదు అందునగాని సత్పదార్థంయొక్క స్వరూపజ్ఞానం కల్యగతంకాదు. అనగా భక్తి బాల్యమనిన్నీ వైరాగ్యం యౌవ్వనమనిన్నీ జ్ఞానం కౌమారిమనిన్నీ ఇట్టి యవస్థయందే జ్ఞానం ఆరూఢత్వంగా నిలుచును. దీనికే కౌసల్య అని చెప్పబడును.

18 (ప్రశ్న) హిరణ్యాగర్భుడన నేమి. (ఉ) హిరణ్యమన బంగార మనిన్నీ ఇట్టి బంగారంవంటి మహాకారణ శరీరమునందు ఉండునట్టి చైతన్యమునకే హిరణ్యాగర్భుడను నామము.

19 (ప్రశ్న) స్వామీ హిరణ్యాక్షునకు గౌరవము తక్కువయు హిరణ్యాగర్భునకు గౌరవము హెచ్చుటయు యందువలన అనగా హిరణ్యం హిరణ్యం యని మొదటి నామము ఏకవచనముగా పలుకుచుండ ఇద్దరకును గల తారతమ్యము లేమి. (ఉ)హిరణ్యాక్షుడన ముందు చెప్పిన హిరణ్యమయకోశాంతర్గతమగు యేకొక్క చైతన్యము గలదో అది చెక్షురింద్రియముద్వారా బయటికి వ్యాపించి నామరూపాదులయందు కర్తృత్వాదులు వహించుటచే హిరణ్యాక్షుడని చెప్పబడును. (శృతి) ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశాన కల్పితః జాగ్రతాది విమోక్షాంతా సంసారో జీవకల్పితః అనగా ఆ తెలివి బహిర్ముఖ మగుటచే జీవుడనే కల్పిత నామము వహించి మిథ్యాసంసారము సృష్టించుచున్నదనియు అందుకుగాను సద్గురు నాశ్రయించి శ్రవణమన నాదులనే మహాజాగ్రత పొందినయెడల ఈకల్పిత సంసారమునుండి విముక్తినొందుననియు తెలియునది యిందుకు (శృతి) బహిర్ముఖం పశ్యేదిదృశ్యేజేతా మంతర్ముఖం పశ్యతిచిత్స్వరూపం మథ్యేతమో స్వప్న మయూహిజీవా రనాదిదేవం మనస్స స్వభావం అనగా ముందు చెప్పిన తెలివి మనసుద్వారా బహి

ర్ముఖమైనయెడల దృశ్యాకర్షణ కలుగునుగానా అదియే రాక్షసవృత్తి ఆ తెలివి అంతర్ముఖమగునెడల స్వస్వరూప జ్ఞానము ఇందుకొరకే హిరణ్యగర్భుడనియు నామాంతరములు గలవు.

20 (ప్రశ్న) శుక్రాచార్యుడన నేమి. (ఉ) సుజ్ఞానము క్రమక్రమముగా మరుగుపరచునది అవిద్య కావున అదియే రాక్షసకృత్యమనిన్నీ కావున దుర్వృత్తులగు రాక్షసులకు ఆచార్యుడను మలిన అహంకారముగా తెలియునది.

21 (ప్రశ్న) బృహస్పతి అనగా నేమి. (ఉ) బృహస్పతి అనగా బృహత్పదార్థ మనిన్నీ అనగా సర్వేంద్రియములకు పైగావున్న వస్తువనిన్నీ ఇందుకొరకే సుద్ధవృత్తులగు దేవతలకు ఆచార్యుడుగా నెన్నబడియె. అనగా శుద్ధ అహంకారముగా నెన్నబడియె.

22 (ప్రశ్న) ధర్మార్థ కామమోక్షము లన అర్థమేమి. (ఉ) వత్సా, యిదివరలో చెప్పిన శాస్త్రార్థము అందరకూ తెలిసినదే. అనుభవార్థ మెట్లన, ధర్మమన తన్ను తాను తెలియుటయే మానవజన్మకు ముఖ్యధర్మమనియు, అర్థమన వాక్కుద్వారా వినునదియు, ఈ శబ్దములకు సత్యార్థమును గ్రహించుటయే అర్థమనియు కామమున తన స్వరూపమును తెలుసుకొనుటలో ముఖ్యకోరిక గాన కామమనియు వీనిద్వారా కలుగునదియే మోక్షమనియు తెలియునది.

23 (ప్రశ్న) బ్రహ్మజ్ఞానికి సమస్త దేవతులు స్వాధీనమగుదురన నేమి. (ఉ) సర్వేంద్రియములకు ఇంద్రాది దేవత లధి దేవతలు గాన ఇంద్రియము లెప్పుడు స్వాధీనమైనవో అప్పుడే సమస్త దేవతులు స్వాధీనము.

24 (ప్రశ్న) జ్ఞానికి అజ్ఞానికి గల తారతమ్యమేమి. (ఉ) ఆవరణ రహితుడు జ్ఞానియనియు, ఆవరణసహితుడు అజ్ఞానియనియు తెలియునది.

25 (ప్రశ్న) మాయ అనిర్వాచ మనగా అర్థమేమి. (ఉ) చీకటి యెట్లు అనిర్వాచ్యమో అనగా ఆ చీకటికి ఉపాదాన కారణముగాని, నిమిత్తకారణముగాని లేనట్లును, ఉత్పత్తిస్థితులకు స్థానము లేనట్లును, మాయకును అనిర్వాచ్య మని చెప్పబడును.

26 (ప్రశ్న) ఆవునకు బంధం వేసినగాని పాలకు పవిత్రత లేదని చెప్పెదరు. అటులైన శాంతమగు గోవునకు అట్లు వేసినయెడల జీవహింస కాదా. (ఉ) మనస్సను గోవునుండి జ్ఞానమను క్షీరమును తీసినచో పుణ్యాఖర్మలను బంధము వేయనిది పవిత్రత కాదనియు, పాలు తీసినవెంటనే బంధము విప్పునట్లు జ్ఞానముకలిగిన తక్షణం ఖర్మరహితమగును.

27 (ప్రశ్న) పరాత్పరుడన నేమి. (ఉ) దేహమునకు పరంగా యుండువాడే పరాత్పరుడు.

28 (ప్రశ్న) ప్రహ్లాదుడన నేమి. (ఉ) ప్రకృతిని అహ్లాదకరముగా గాంచువాడే ప్రహలాదుడు.

29 (ప్రశ్న) అర్ధఉదయమన నేది. (ఉ) వత్సా, అర్ధవుదయమున పరోక్షజ్ఞానము. అనగా ద్వైవమనునది వకటి కలదనియే తెలియునుగాని అదియెట్లుగా యున్నదో తెలియనంతవరకు అర్ధఉదయమనియే చెప్పవలెను.

30 (ప్రశ్న) మహాఉదయమనగా నేమి. (ఉ) అపరోక్షజ్ఞానమే మహావుదయము అనగా ఆవరణవిక్షేపాది శక్తులు పూర్తిగా నసించి స్వరూపాస్తితియందు ఉండుటయే మహావుదయం.

31 (ప్రశ్న) స్వామీ స్త్రీలకు ఐదవతనమే ముఖ్యమని చెప్పుట యెందులకు. (ఉ) ఆయిదవతనమనగా జాగ్రత స్వప్న సుషుప్తితురీయము యను చతురావస్తలను అతిక్రమించి తురీయాతీతమును చెందుటయే తానను మాట అదియే ఐదవతనము అట్లు కానియడల మూడవతనము అట్లుగాని యెడల మూడవతనము నాలగవతనముయని చెప్పక వైదవదే తానని చెప్పిరి.

32 (ప్రశ్న) స్వామీ కొందరు రుషులు మృగములకు వుద్భవించిరనియు మహాజ్ఞానులైరనియు చెప్పుట యాశ్చర్యము యెట్లన పాపఖర్మాధిఖ్యతచే తిరిగ్యదేహము సంభవించునని శాస్త్రము చెప్పుచున్నది పుణ్యఖర్మ అధికము వలనకాని జ్ఞానోత్పత్తి కాదని కూడా తెలియవచ్చుచున్నది. అట్లయిన వారికి జ్ఞానమెట్లు కలిగినది యిందుకు (శ్రు)రుష్యే శృంగో మృగ్యాః కౌశికః కుశాత్తు జాంబుకో జంబుకాత్తు

వాల్మీకో వాల్మీకాత్తు వ్యాసః కైవర్తకన్యాయం శశి పృష్టాద్గౌతమః వశిష్టో ఊర్వశ్యాం అగత్యాఃకలసే జాతఇతీ శృతత్వాత్తు యని ఈవిధముగా వజ్రసూచికోపనిషత్తు నుడువుచున్నది గాన దీనికి నిజమగు అర్థము తెలుపవలయును.
(ఉ) నాయనా మంచిప్రశ్న చేసితివి గాన నిదానముగా వినుము. (శ్లో) సత్యం జ్ఞానం తపోమానం దృతిధర్మం తితీక్షుచ ఉత్సాహం నిశ్చలం ధైర్యం సాత్వికగుణ లక్షణంయీ మొదలగు గుణములనే తత్వసిద్ధులు లాలనమృగములుగా పోల్చిరి. అదియేదియన వుత్సాహమను లేడికి రుషీశృంగుడు కలిగెననియు యేకమే వాద్వితీయం బ్రహ్మయను వాక్యమే కొమ్ముగా గలిగెనని భావము.

33 (ప్రశ్న) కౌశికుడు కుశదర్భవలన యెట్లు జన్మించెను. (ఉ) పుణ్యాఖర్మలనే తృణమువలన కలిగిన కుశలత్వబుద్ధియే కౌశికుడు.

34 (ప్రశ్న) జంబుకమునకు జాంబుకమహారుషి ఎట్లు జన్మించెను. (ఉ) పరమార్థమందుగల యీశయే జంబుకమనబడును. దీనికే ప్రపంచమున నక్కాశయనెదరు.

34 (ప్రశ్న) వాల్మీకమునకు ఉద్భవించినవా రెవరు. (ఉ) బిడ్డా హృదయమను పుట్టయందుగల యేయొక్క శుద్ధ చైతన్యముగలదో యిందుకు (శృ) హృత్పుండరీకమధ్యేతు భావయే త్పరమేశ్వరం సాక్షిణంబుద్ధి వృత్తిస్య పరమ్రేమ గోచరం యను స్వరూపుడే వాల్మీకుడు.

35 (ప్రశ్న) వ్యాసుడు కైవర్త కన్య కెట్లు కలిగెను. (ఉ) కైవర్తకన్య యనగా కైవల్యమందు వర్తించే కన్య. శుద్ధమనస్సనియు తద్వారా అనుభవింపబడిన వ్యాఖ్యారూపముగా శృతియు క్తిజ్ఞానమే వ్యాసుడు.

36 (ప్రశ్న) శశిదేటికి గౌతము డెట్లు కలిగెను. (ఉ) శశియనగా చంద్రుడనిన్నీ అట్టి అధిష్టానముతో కూడిన మనస్సు గోప్యమగు తత్వము గ్రహించుటయే గౌతముడు.

37 (ప్రశ్న) వశిష్టుడు ఊర్వశికి కలిగెనన నేమి. (ఉ) ద్వైతాద్వైతముల యొక్క విమర్శనకలవాడే వశిష్టుడనియు ఉపమానయుక్తులు గలిగి అరసినబుద్ధియే ఊర్వసియనియు తెలియునది.

37 (ప్రశ్న) అగస్త్యుడు కలిశయందు కలిగెనన నేమి. (ఉ) దేహమే కలశయనియు అందుగ చైతన్యం ఇంద్రియముల ద్వారా బయటకు వ్యాపించుటయే అగస్త్యుడు. యిందుకు (శృ) యేనేక్షితే శృణోతీతం జిగ్రతి వ్యాకరోతిచ స్వాదుస్వాదు విజానాతి తప్రజ్ఞానం ముదీరీతంవిశధమే.

38 (ప్రశ్న) స్వామీ ఈ కతృత్వాది దుఃఖరహితమెప్పుడు. (ఉ) శరీరాంతమందు.

39 (ప్రశ్న) శరీరాంత మెప్పుడు. (ఉ) పుణ్యాపాపానంతరము.

40 (ప్రశ్న) పుణ్యపాప నివర్తి యెప్పుడు, (ఉ)రాగద్వేషానంతరము.

41 (ప్రశ్న) రాగద్వేషానంతర మెప్పుడు. (ఉ) అనుకూల ప్రతికూల జ్ఞానరహితమప్పుడు.

42 (ప్రశ్న) అది నివృత్తి యెప్పుడు. (ఉ) అభేధ జ్ఞానమువలన.

43 (ప్రశ్న) అభేధజ్ఞాన మెప్పుడుకల్గును. (ఉ) అవిద్యానంతరము.

44. (ప్రశ్న) అవిద్య యెప్పుడు నసించును, (ఉ) స్వస్వరూపజ్ఞానము కలిగిన వెనుక.

45 (ప్రశ్న) ఆత్మదర్శన స్పర్శన వాచాద్యుల కగోచరమైనయెడల యెట్లుగా పొందవచ్చును. (ఉ) నీవు త్రికాలములయందు బయలు నాశ్రయించి యుండిననూ అదియెట్లు దర్శనస్పర్శన వాచాద్యుల కందకయున్నదో అట్లుగనే ఆత్మ నీవై యుండుటవలన అన్యథా వచింపకూడదు.

46 (ప్రశ్న) సాక్షి సర్వదేహములయందు ఒకేవిధముగా యుండినయెడల కొందరు జ్ఞానిగను మరికొందరజ్ఞానిగను సుఖదుఃఖాదులు నానాత్వముగా అనుభవించుటకు కారణమేమి. (ఉ) దేహములు పుణ్యాపాపమిశ్ర కర్మలవలన ఉత్పత్తియగుటచే ఆయూ వుపాదులకు తగు అంతఃకరణ ఏర్పడియున్నది. గాన సుఖదుఃఖాదులు జ్ఞానాజ్ఞానములు అంతఃకరణ ధర్మములేకాని అందునుగల సాక్షికిలేవు.

47. (ప్రశ్న) సర్వసాక్షి యగునెడల సర్వజ్ఞత్వాదులు అలవడక కొన్ని దేహములయందు ఆత్మ కించజ్ఞత్వా

దులతో నేల సంచరింపవలయును. (ఉ) కొన్ని దేహముల యందు బుద్ధివృత్తులు అంతర్ముఖం కానందున సచ్చిదానందా దులునూ గ్రాహ్యమగుట లేదు. ఉదాహరణ మృదంగమును చేత తట్టినగాని ధ్వని కలుగనట్లు బుద్ధివృత్తులు ఆత్మయందు ప్రచరించినగాని సర్వజ్ఞత్వాదులు గోచరముగావు.

48 (ప్రశ్న) స్వామీ ఆత్మయందుగల బాధము సత్యమా అసత్యమా (ఉ) నాయనా త్రికాలములయందూ ఆత్మకు బంధనము లేదు. అట్లు బంధమే సత్యమైనయెడల జ్ఞానముకలిగినను నివర్తి కాకూడదు. (ఉ) యెట్లన సర్పమే సత్యమైనచో దీపమువలన నివర్తి కాకూడదు.

49 (ప్రశ్న) స్వామీ అధ్యారోపముగా ఆత్మయందు బంధభ్రాంతి యున్నదంటిరి. అట్లు సత్యముగా లేనియెడల సంశయముగా నున్నది. యెట్లన దృష్టాంతరమున సర్పమును ఇదివరలో చూచినగాని రజ్జువునందు సర్పభ్రాంతి కలుగనట్లు ఆత్మయందు ప్రపంచకభ్రాంతి కలుగుటకు ఇదివరలో యిట్టి సత్యమైనవస్తువ వకటి చూచియుండవద్దా. (ఉ) ఇదివరలో సర్పమును ప్రత్యక్షముగా చూడకయుండిననూ వినికిరివలన గాని దేవాలయమున వెండిసర్పమునుగాని స్వప్నమందుగాని సర్పమును చూచి యిచ్చట రజ్జువునందు భ్రాంతికలుగ వచ్చును. అట్లుగనే వ్యవహారప్రతీతివలన లోకుల వాడుక ప్రకారం తనయందు బంధమున్నదని యనుకొనుచున్నాడు.

లోకమునందు నేతిబీరకాయ యనుటయేగాని నెయ్యికాన నట్లును బంగారుపిచ్చుక యనుటయేగాని దానియందు బంగారము కానట్లునూ అట్లే తనయందు బంధముకానము.

50 (ప్రశ్న) స్వామీ కారణములేని కార్యము లేదని చెప్పిరి. అట్లయిన భ్రాంతికాలమందు సర్వస్మరణ లేకుండినను భ్రాంతి కల్గుచున్నది. (ఉ) వత్సా అట్లనినయెడల జన్మాంతమందు అనుభవించునపుడు యేకాలమునకు యేది అనుభవింపబడునో ఆస్ఫురణలేకుండిననూ అనుభవమునకు వచ్చుచున్నది అనగా అంతఃకరణయందు కర్మబీజములు సంస్కార రూపముగా నాటియున్నవి.

51 (ప్రశ్న) స్వామీ త్రికాలములయందు జగత్తు మిథ్యయని చెప్పి శశివిషాణములును వధ్యపుత్రుని దృష్టాంత మిచ్చిరి. అట్లయిన అవి నాకకమాటయేకాని ప్రత్యక్షము కాలేదు. జగత్తట్లుగాక ప్రత్యక్షానుభవము. యెట్లు మిథ్య యనవచ్చును. లేనివస్తువన గోచరించునా. (ఉ) వత్సా, ఆ సత్పదార్థము గోచరము కాకూడదను పక్షమున స్వప్న పదార్థములున్నూ ఇంద్రజాలకుని పట్నమున్నూ ప్రత్యక్షాను భవముగాపున అవి సత్యమైనచో జగత్తు సత్యమనవచ్చును.

52 (ప్రశ్న) మాయాబ్రహ్మలు అనాదులైనయెడల బ్రహ్మసత్యమనియు మాయాకల్పితమగు జగన్మిథ్య యనియు యెట్లు చెప్పవచ్చును. (ఉ) చీకటియున్నూ అందు

పదార్థములు బ్రహ్మజ్ఞానమువలననూ స్వప్నపదార్థములు వ్యావహారికజ్ఞానమువలననూ నివ_త్తియగుచున్నవి. గాన జాగ్రితవ్యావహారికమనియు స్వప్నప్రాతిభాసికమనియు చెప్పబడును.

57 (ప్రశ్న) స్వామి చిజ్జడములు రెండని చెప్పి అందు జడమునకే పరిణామములు కలవనియు అందుంగల చైతన్యమునకు లేవనియు తెలిపితిరి గాని జాగ్రత్స్వప్నాదులయందు పదార్థములు వకేతీరున యుండిననూ అందు కధిష్టానమగు తెలివియే మారినట్లు తెలియవచ్చినది. (ఉ) చేతనము ద్వివిధముగా చెప్పబడును. వ్యాపకచేతనమనియు ఆభాస చేతనమనీయు అందు వ్యాపకచేతనము శరీరేంద్రియాదుల యందును ఆభాసచేతనము అంతఃకరణయందును కలదు. అందు బుద్ధివృ_త్తియందుంగల ఆరూఢచేతనమే జ్ఞానమునకు కారణమగుచున్నది. అట్టివృ_త్తికే ఉత్ప_త్తినాశములు కలవు గాని చేతనమునకు లేవు. జ్ఞానమునకు ఉపాదానకారణము వృ_త్తియనియు నిమి_త్తకారణము చేతనమనియు తెలియునది గాన జాగ్రత్స్వప్నాది పదార్థములను చూచెడి జ్ఞానము మారుపుచెందక అందుంగల వృ_త్తియే మార్పు చెందుతున్నది.

58 (ప్రశ్న) స్వామీ శంకరుడు వేదశాస్త్రములకు నిజార్థము భాష్యరూపమున తెలిపిన నేమి. (ఉ) వత్సా శంకరుడన శంకని హరింపచేయువాడు యని భావము. వాని

వాచ్యార్థమున సద్గురువనియు లక్ష్యార్థమున ఆత్మస్వరూపు డనియు తెలియునది.

59 (ప్రశ్న) స్వామీ లోకమున కొందరు త్రిశంకు స్వర్గమని చెప్పుదురు యందువలన. (ఉ) నాయనా త్రిశంకు డన మూడుశంఖులుగల వాడు. అనగా జగజ్జీవపరమాత్మలు త్రికాలములయందు నిత్యమాయనెడు శంఖులు. యిందుకు (శ్రు) సంశయాత్మా వినశ్యతియనియు జ్ఞాతృజ్ఞానజ్ఞేయా దావిర్భావతిరో భావా జ్ఞాతాస్త్రియం తదావిర్భావా తిరో భావరహితః యనునట్లు జగజ్జీవుల నిత్యములనియు అందు కధిష్టానమగు స్వస్వరూపాత్మ సత్యమనియు ఇట్లు తెలియక సంశయాత్ముడు నసించునని తెలియునది అట్టివానికి ఇహము గాని బరముగాని లేక మధ్యస్తుడై యుండువానికే త్రిశంకు స్వర్గమనియెదరు.

59 (ప్రశ్న) శంకరుడు షణ్మతములను ఏకత్వపరచె నన నేమి. (ఉ) ముందు చెప్పిన త్రిశంఖులను రహితపరచి షట్చక్రములమీదుగా సంచరించెడి చైతన్యమును ఏకత్వ పరచినదే షణ్మతములను ఏకత్వపరచెననుట,

60 (ప్రశ్న) మంత్రమనగా నేమి. (ఉ) మన్ అనగా విచారణవలన త్రిగుణములను విడుచుట.

## కీర్తన

(ఆనంద మానంద మాయెనూ మాదిరి)

ఆపరీమితానంద మాయెనూ నా చపలాగుణములెల్ల సంసెనూ। మద్గూరు దరిజేర్చి సద్బోధ చేసినందుకు॥ అ॥ అష్టా మదము లణగిపోయెనూ పక్క నిష్టాచెనిలచియుండు టాయెనూ। దుష్టా చాతుష్టాయము నష్టంబుచేకొని। శిష్టూలదరి జేరి స్పష్టంబు తెలసినందుకు॥ అ॥ అజ్ఞానపడవి వెలుతురాయెనూ ఆసుజ్ఞానమనే జ్యోతిచూచెనూ। కుగ్రామమూను వీడి విజ్ఞానమూననేను। ప్రజ్ఞానులచెంతకు జేరి స్వజ్ఞానమందీనపుడె॥ ఆ॥ దుష్టూసంగతి దూరమాయెనూ ఆద్రష్టాగ నిలచియుండుటాయెను। వ్యాశ్రసమిష్టులను నష్టంబుచేసుకొని అష్టాదళపద్మామందు దృష్టిగ నిలచీనందుకు॥ అ॥ పంచాభూతామూల నెంచియూ ఆసంచీత ఖర్మములన్ని దృంచియూ వంచానలేక గురుని పంచాయు చేరీనందుకు కొంచాఫ గుణములన్నీ వంచీ వర్తించబోతె॥ ఆ॥

## కీర్తన

(తగిన వరుడూ కాదెనీకు మాదిరి)

ఈమని సీతారామమ్మ

ఇట్టిసాద్గురు విడచిమనమూ యెట్టులుందుమే॥ యేకమైనా పదవి మనకూ విశదపరచెనూ॥ ఇ॥ కాలమంతా పోవుచుండ కరుణజూచెనే। కమలనాభుని మహిమమనకు కలుగ

జేసెనూ॥ ఇ॥ ముద్రభావామూను దెల్పి మూర్ఖతంతయూ। నిర్మూలామూను చేసీ నీరజాక్షులూ॥ ఇ॥ ప్రజ్ఞానం బ్రహ్మ మూనే పేరుదెల్పెనే। ప్రణవరూపంబతనకూ బోధజేసెనూ॥ ఇ॥ సాధనాసంపత్తి దెల్పి సాఖ్యమందునా। సంశయాగంధీని దీసి సౌఖ్యమొసగెనూ॥ ఇ॥ వాసనాత్రయమందు మనమూ వశమైయుండగా। వాదభేదామూను బాపీ విశదపరచెనే॥ ఇ॥ వాచవాచ జ్ఞానమంతా విశదపరచినా। బంధరహితులైన మీకూ వందనంబిదే॥ ఇ॥ పాలలోచన భజనచేతను భక్తి తెల్పెనే। పాపపుణ్యాము బాపిమనకూ ముక్తిజూపెనే॥ ఇ॥ ఈషణాత్రయమును విడుమని ఇందుముఖులతో ఈశ్వరా రూపంబులమనకూ యిపుడెచూపెనూ॥ ఇ॥ జనన రమణా మూలుబాపిన ఘటనవైద్యులూ। జన్మరహితము చేయునట్టి కేషశయనులూ॥ ఇ॥ వాసిగా యలమంచిలీ పురమందు వెల నా। జోగమాంబా కెప్పుడు నేజోహారు జేతునూ॥ ఇ॥

# కీర్తన

(రంగూగ మీా వ్రేలి ఉంగరమంకు మాదిరి)

దూర్వాసుల లచ్చమాంబ

ధరణిలో మనకొరకు దైవముద్భవించె తెలుసుకొండీ। మూడాసూలనందరిని దరిజేర్చుచుండెను తెలుసుకొండీ॥ ధ॥ మాయగప్పి మనము మనుష్యులనుకొంటిమి తెలసుకొండీ। మార్గమ్ము దెలిపేటి మాధవులుద్భవించె తెలసుకొండీ ॥ధ॥

భూరూహమని యేటి పుట్టలోబడితిమి తెలసుకొండీ। ఆపుట్టాను విడపించె పట్టుదొరకెమనకు పట్టుకొండీ॥ ధ॥ నవద్వారముల కొంప నమ్మియుండక వేగ తెలసుకొండీ। నరకమ్ము విడపించె నారాయణులాని తెలసుకొండీ॥ ధ॥ చిత్తుగుణములు విడచె చిన్ముద్రచూపెను తెలసుకొండీ। అనుక్తి రజితభ్రాంతి సూక్ష్మము దెలసుకు ముక్తినొందుడీ॥ ధ॥ ధరణిలో నద్గురు రహస్యముదొరకెను తెలసుకొండీ। తరముగాని పరమ పదవి దొరకె మనకు మరువకండీ॥ ధ॥ గురుమర్మమెరుగక వెరగుపడియుంటిమి తెలసుకొండీ। ఇంక పరముచేరేవరకు పట్టు విడువని పట్టుపట్టుకొండీ॥ ధ॥ మూడుగుణములవలన మూర్ఖులైతిమి తెలుసుకొండీ। మూలాము దెలిపేటి ముక్తికాంత దొరకె తెలసుకొండీ॥ధ॥ సావధానముగాను సర్వము దెలపును తెలసుకొండీ। స్వాధ్యాయవేత్తయగు జోగమాంబ చెంత చేరూకొండీ॥ ధ॥

## కీర్తన

(మంగాళమని పాడరే అన్నాకుమారునకు మాదిరి)

పాకల వెంకటరత్నమమ్మ.

భజనాచేతామూరారే। మనభక్తావత్సలుని భావము రంజిల్ల॥ భ॥ కామక్రోధములాను కట్టివేసిమనము। కమలానాభుని చెంత మనకలుషాముహరియించ॥ భ॥ నవద్వారముల కొంప నమ్మియుండుటమాని। నాదానందుని మదిని నమ్మి సేవింపాగ॥ భ॥ వేదా వేదాంతములు వివరించిదెల్పుచు।

వేదాస్వరూపాము బోధాదెల్పుచుండ॥ భ॥ హృదయామం దుండేటి వృత్తులవిడనాడి। బుద్ధినిలకడజేసి సుద్ధామైనారామ॥ భ॥ సాధాన చతుష్ట సంగతంతెయు దెలసి। సౌఖ్యామందమాన సర్వేశ్వరుని చెంత॥ భ॥ భావామందుండేటి భక్తి దెల్పుతెగాని। యుక్తియేమియు లేదు యూహాచాలదింక॥ భ॥ జనన మరణాభాద చెరసీవేసినట్టి। జోగమాంబచెంత సంతోషాము చేరి॥ భ॥

## కీర్తన

(ఛీఛీనీకు తగదే వదిన మాదిరి రెట్టించిపాడేది.)

కోట సుబ్బలక్ష్మమ్మ.

ఓహో గురూనాథామీాదు మోదాముసుచూడగానూ। ఆశ్చర్యమైతో చెమిదు వాత్సల్యతచూడాగను॥ ఓ॥ భక్తివిరాగములూ గలవని యుక్తిగనూ దెల్పితిరి। ముక్తి మార్గమూను దెల్పా కర్తామైమీారుండగా॥ ఓ॥ ప్రహలాదుడు యనచుమము ప్రేమతోను దెల్పిటిరీ। అహ్లాదముయాగు మీాదు బోధా చేతే కాదామాకు॥ ఓ॥ అనుభావము చూడా మమూ అహల్యతో సమమంటిరి। అనుకూల్యముయాగూ మీాదూ సేవా చేతా కాదామాకు॥ ఓ॥ ధమయంతితో సామూమని దయతోడను దెల్పితిరి। మదవాతులందరకు మీాదు కథ యంతయూ దెల్పూచును॥ ఓ॥ మీాదూ సాధూబుద్ధిచేతా సావిత్రితో సమమంటిరీ। గాయాత్రి రూపంబుమాకు పావి

త్రము తెల్పుచునూ॥ ఓ॥ త్యాగాబుద్ధీ చూడగనూ చెంద్రా వదనా మీకే చెల్లూ। మందామతులాగుమము చంద్రామతి యనజెల్లునా॥ ఓ॥ గూరోర్గురువూలుయని గట్టాగనూపల్కి తిరి। బట్టాబయలై వీరుండియు వట్టిమాటాలాడాదగునే॥ ఓ॥ పాపాపుణ్యామూనూ బాపీ పరపార్ధమను పాలూబోసి। లాలించియు మేలెంచియు జోలాపాడిన జోగామాంబా॥ ఓ॥

## కీర్తన

(కృష్ణుని భజియింపు మానాసా మాదిరి)

ఈమని సీతారామమ్మ.

ఈశ్వరుని స్మరియింపుమనసా। ఇలసౌఖ్యమునువిడి॥ ఈ॥ ఈశ్వరా నీ స్మరణచేసీ ఇహమునందు బ్రాంతివిడచీ। యీషణత్రయమందు నీవు ఇమిడియుండకా భాసురముగా గురునీపాద సేవాచేయుచుంటీవైనా। చేటులేని పదవిచెంది శేషాశయునిని గాంచగలవు॥ ఈ॥ మూటికీ మూలమెరిగి ముందునున్న సుఖముగాంచీ। మందహాససుందరూనిడెందమందుంచీ। సందియంబులెల్లాదీరా వందానీయుండైనయట్టి। కందర్పజనకునినీ వందముతో స్మరణచేసి॥ ఈ॥ చూపులోను చూపుచూసి చూపురూపులను మాపీ। సుషుమ్నయందుననిలచి సూటీమీరాగా। చుక్కాలలోయున్నయట్టి చక్కానిచందురిణ్ణిగాంచి। నిక్కాముగనిలచియుండిన నిర్గుణాత్మునిగాంచగలవు॥ ఈ॥ కంటిలోనువున్నయట్టి కాలకంఠునిగాంచలేకా। కాలయముని

వలలోజిక్కి కలతనొందకే। తుంటారికామాదుల తంటాలైన పాడలేవు వెంటనున్న కొంటిగుణములు గెంటివేసియుండు మిక॥ ఈ॥ భూమిమధ్యముననిలచి పుండారీకాక్షునిగాంచీ। పూర్ణభావముతోడనీవు పుణ్యవశమూనా। గంగాయమునా నదులలోనూ నుష్పింగూచూనూనుంటివైన జర్మరహితమై నయట్టి జోగామాంబపదము జెందెద॥ ఈ॥

## కీర్తన

(రండీ ఓసాధులార మాదిరి) దూర్వాసుల సీతారామమ్మ.

కాంచరెగురుమహిమనే కడుభక్తితోడమీర వేగ॥

కాం॥ పామరులగు మనసందరి పరమకృపనుచూచగా। పామరత్వమువిడచివేగ పరముగాంచుడీ వేగ॥ కాం॥ లోభత్వము చేత పరలోకము గనలేకా। బుద్ధిలోభత్వముచేత పరాలోకముగనలేకా। కాలయమునిబాధమనము గానకుంటిమీ వేగ॥ కాం॥ మూడింటీలోనబడీ మునిగియుండకా। ముక్తిమార్గము తెలుసుకొనీ మూలముగనుడీ వేగ॥ కాం॥ గర్భనరకబాధమనము గానకుంటిమీ। ఘనమగు దుస్సంగములతో గడుపుచుంటిమీ వేగ॥కాం॥ పరమాత్మస్వరూపమగు పరమసాధ్వి దొరకెమనకు। శరణనరక్షించుబిరుదు కలదుగావునా వేగ॥ కాం॥ జ్యోతిరూపమూననున్న జోగమాంబనెపుడుమదిని। ధ్యాన్నములోనుంచివేగ పరముగాంచుడీ వేగ॥ కాం॥

# మంగళహారతి

(మంగళంబూ యెదుపుంగవా మాదిరి.)

ఈమని సీతారామమ్మ.

మంగాళమిదె గొనుగోనుమూ । ఓ కళ్యాణ మీాకిదె కర్పూరహారతి॥ మం॥ దాసూలనందరిని దైత్యోడాబ్రోచీనా । దాతావై వెలసిన దైవాస్వరూపమీాకు॥ మం॥ సృష్టికర్తా మీాకు శృంగారముగ నేడూ। సుదతులతో నొసగేద సూర్యావంతామీాకు॥ మం॥ వేషాముల్ వేసీన శేషాభూషామీాకూ । వేదాముల్ గన్నట్టి వేదాంత వేద్యమీాకు॥ మం॥ అష్టాంగ యోగముల్ నిష్టాతొసల్పుచూ। కష్టామనియెంచాక సిష్టూల బ్రోచునట్టి॥ మం॥ పాపాలమధ్యాను వ్యాపించియుండీన । పలుకూల కావాల ప్రబలీయున్నట్టి తల్లి॥ మం॥ యెలమంచిలి పురవాస యేణోనారాయూణా । యేరీతిబ్రోతూవో ఇనకూలాబ్ధిచంద్ర॥ మం॥

# కీర్తన

(రామా వందనం మాదిరి రెట్టించిపాడేది.)

జననీవందనం। ఓజాగద్వందితం। భక్తాపాలనం। జననీ భక్తాపాలనం। భవవీమోచనం జన॥వం॥ వింటినీ నీదూకరుణ గంటినీ। జననీ శరణాంటినీ। జననీ కావుమంటినీ జన॥ వం॥ వేదమూలెల్లామీా స్వాధీనమూ మోదమందియూ జనని ఆనాదమందునా జన॥ వం॥ జ్ఞానమూ భక్తియోగమూ ।

ము_క్తి నూర్గమూ జనని కీర్తి సాధ్యమూ జన॥ వం॥ నేరమూ నిన్నూ కొనీయాడనూ జనని నేయెంతా దాననూ। జనని నాపై పంతా మేలనూ జన॥ వం॥ ఘోరమూ అయిన ఈ సంసారమూ। భారమంటినీ జనని భా నీదరినిచేర్చు మో జన॥ వం॥ యోగినీ యైన ఓజోగమాంబనీ। పాదమందునా జనని పా భక్తీ గంటినీ జన॥ వం॥

ఇట్లు విధేయురాలు,
అమలాపురపు సీతారామమ్మ.

సంపూర్ణం.

---

## కీర్తన

(చీచీనీకూ తగ దేవదిన మాదిరి.)

మద్దాల నూగమ్మ.

యేమీ యీాలలనామహిమా యెన్నంగనూవశమే మనకూ। భోజూని సన్నిధీనున్న కాళీదాసునీకైనా॥ యే॥ పుట్టీనదీ మొదలూనునా మిట్టీపనీతనుగానకా। వట్టీవాచకు లాగనీ మిట్టీపడీ తిరిగీతిమీ॥ యే॥ ధనమార్జనాకోరకూ బుధా జను లెందరో గలరూగనీ। విధినీషేధము దెల్పెడీ విజ్ఞానా విమలాయిమె॥ యే॥ అపరిగ్రహా వ్రతమూ నీమెవిపరీతమూగ్గా బూనెను। పతితూలమైనట్టిమన తరియింపు నేతాగో రెను॥ యే॥ నేరానులెంచాకా మనా భారాము తనపై మోపుకూ।

సారేసా రేకూ స్రుతీ సారానుభవముదెల్పుచు సంసారాము నిస్సారామనూ॥ యే॥ సుగుణాములామేటీయగూ పేటీకనూ చేకొంటిమిూ। యేటీకిం కేటీ భయామేటీకి ముమ్మాటికినీ॥ యే॥ చిత్రించినా ప్రతిమావలె చిక్కేమనానూనాకి మే। తప్పించుకూ నేటకూ తరమాయెన్నటీకైనా॥ యే॥ షడ్జెన్మ సంస్కారూలమై సద్గురువునూ చేకొంటిమిూ। సంపూర్ణ్నము బోధించు యూస్వామిూసన్నిధినుంటిమిూ॥ యే॥ పురుషాకృతీ బూనామనా పెంజీకటీబాయూదనీ। జోగమాంబా యవతారిణియై సోహం భావము దెల్పెనూ॥ యే॥

## కీర్తన

(మంగళంబు శంభురణీ యనుమాదిరి)

మాతనిన్ను గంటి నేడు। యెంతధన్యనైతినహో॥ మా॥ భూతపంచకంబులేసి భువననిలయ నిన్నుగనా। బుద్ధివికసించె మాకు పుణ్యామేమొ దెల్పుతల్లీ॥ మా॥ సహస్రారవాసినిన్నూ సందర్శించీన మొదలు। సాంసార వాంఛలన్నీ సఖియరో మరచుంటిమమ్మా॥ మా॥ మందహాసవదననీదు సుందరంబు చూడగను। కందర్పాడనుచుమాకూ సందేహముగల్గె తల్లీ॥ మా॥ కూటస్వరూపినీదు వాటమంత తెలియగనూ। భక్త హృదయకోటయెందు బాగుగనివసిస్తివమ్మా॥ మా॥ కమల నేత్రినిన్ను నేత్రినేత్రముతో నేడుగంటీ। మోక్షస్వారూపినాదు మోహమాటము దీర్చుతల్లీ॥ మా॥ కల్పవల్లి నిన్ను మేము

కాంచగల్గినట్టి వేళా। కలుషములనుద్రుంచి వేగ కైవల్య మొసగవమ్మా। వాసయోగ్యనీదుసహా వాసమహిమ దేమొ గాని। వేషధారిరూపమూపి నిర్దోషిగసేసేవూ॥ మా॥ గ్రంథి విచ్ఛేదనీచందమంత చూడగను। పొందరానట్టిబ్రిహ్మ నంద మందియుంటిమమ్మా॥ మా॥ జోగమూంబనామదరీ సోద్యమైన వేషధరీ। సోమసూర్యాగ్నిమించు సుప్రకాశతేజశాలీ॥ మా॥

# కీర్తన

(యెక్కడా కనపడదూ యెదుకూలనందనుడు మాదిరి)

ఇందూగానవచ్చె ఇనకూలతిలకూడూ సుందరాంగిరో గంటివా। సుందరావదనూడూ కందిర్పజనకూడూ మంద యానరో ఆనందరూపుడుతానై॥ ఇం॥ ద్వాపారాముననూ నా ఆపాదా లెడబాపే॥ శ్రీపతిఇతడేసుమా పాపాలమధ్యనూ వ్యాపించియున్నట్టి ఆపరంజ్యోతి ఈరూపుతానై నేడూ॥ఇం॥ నాదోవినోదూడు వాదంబులనుదీర్చా। ఈదారీతావచ్చేనూ సాధూహృదయవాసీ సనకాదులనుబాసీ। ప్రాపూజేరిననాడు తాపాము లెడబాపా॥ ఇం॥ చెలియైఆత్మబంధువై సద్గురువై మనకూ। ఉపరీమార్గము దెల్పెనూ। అపరిమితానందావార్ధి లోనముడించీ నేరమెరుగనిచిన్నీ బాలూనివలె నేడూ॥ ఇం॥ జపతాపాస్వాధ్యాయా నిపుణులకందరా। చపలాక్షిరోడాగ నా గతిలేనీమనకూ సాద్గతిచూపూటకు వేరె పతిలేనీస్థితిగాంచీ అతులీతాముగ నేడూ॥ ఇం॥ వక్కాడైస్ఫురిఇంచీ పెక్కూ-

రూపులుదాల్చా। అక్కారో యిదిన్యాయమా చక్కెరవర్తి
పీసీ చిక్కాబట్టితీమే నీచిక్కాబట్టితీమేని చొక్కాము ఈ
మాయగా టక్కారి జగమూలో॥ ఇం॥ వాసవాదులకైనా
వశమూగానటువంటి। వేషాకారినిగంటిమే దోసీలొగ్గిదాసా
దాసూలమై ఉన్నా। వేషాముల్ రోసీనను డాసీయుండు
వాడూ॥ ఇం॥ సందూసందులువెదుకా నెందూకె ఈజ్ఞానా।
చందూ్రనిగాంచూటకూ మందాగమనరో బుద్ధీమంతూడౌ
విదురూనీ విందారగించెనీ చందమెరుగవదేలా॥ ఇం॥ బాలా
యోగినీవాతే లీలాదాల్చీమానా మ్రోలా నిలచీయుండగా।
వాలయూముగపూలా వానాలుకురీయూగా నీవారాసూళ
మున ధీరుడై నిలచేనూ॥ ఇం॥ జననారమణారహితా గమ్య
స్తానముమననా భావామూలో తెల్పనే వాలాయూముగ
నాయోధ్యపూరా వాసుడౌ వారిజాక్షుడు యేలమంచిలీ
వాసుడై॥ ఇం॥

## కీర్తన

గురుపూజాసేయరారె గుమిగూడి। భక్తులెల్లా గుణ
రాహితుని తెలియగూహ్యమగు పదమునందు॥ గు॥ ఈషాణా
త్రయములాను యినుపాసంకెలను విప్పి। ఇహవాసానాలు
వదలి యిందికేసూడుఐనా॥ గు॥ తాపత్రాయమనేటి దా
వాగ్ని దప్పిమనమూ। ధైర్యామానేటిజలము చల్లూకొనుచు
వేగా॥ గు॥ అష్టామాదంబులనెడి దూష్టాచేలీయల వీడి
అష్టాంగాయోగసిద్ధి అను భావించీనయట్టి॥ గు॥ మలినా

వాసానాయనే మురికీవాస్త్రిముఖిప్పీ। సుద్ధావాసానా యా నే
ధాతా వస్త్రిముగట్టీ॥ గు॥ నాదాచేతక్కళళాను నయమూగా
బోధజేసి। బిందూస్వారూపియై మన సందేహమూలుదీర్చిన॥
గు॥ యెందెందూగాంచినామన సందేహమూలు దీరక। మం
దూలై యున్న మనలను సందీటా జేర్చినట్టి॥ గు॥ ఊహా తెలి
యాని మనకు ఉపరీమూర్గంబుతోను। ఉపమానాములతో
దెల్పిన। ఉత్సాహాశాలియైన॥ గు॥ విజ్ఞానామూనుమనకు విపు
లామూగాను దెల్పిన। విజయాస్వారూపియైన జోగమూం
బాకు నేడూ॥ గు॥

చ॥ శిశువులు శైకతస్థలులచేరి యొనర్చెదు బొమ్మరిండ్ల నే
విశదములంచు గాంతురు ప్రవీణత కెక్కిన శిల్పులెల్ల దా
దృశమగు మత్కవిత్వము సుధీజనులజ్ఞులు లెక్కసేయరైన
శమము లేనికుచ్చితులు నవ్విన నవ్వరే వారిదాదృశుల్॥

(తా) అనగా బాలురు తమ యాటనిమిత్యార్థము
బొమ్మరిండ్లను కట్టుకొని వేడుకబడుచుండ శిల్పివిద్యయందు
ప్రావీణ్యత చెందిన మహాత్ములైనను ఈబాలుర చర్యల
చూచి సంతసించెదరేకాని వేరుసేయనట్లు గొప్పకవిత్వశక్తి
గల మహాత్ములైనను నావంటి స్వల్పవ్యక్తులచూచి తమరు
ఆనందించుటయేగాక తిరిగి మావంటివారలకు వుత్సాహ
మొందించెదరు. యిది తెలియని మందబుద్ధులు ఉపేక్షించినను
తెలిసీ తెలియని మధ్యస్థులు అపహాసించెదరు. తోయనేర్చు
కుక్క దొంతులుగూర్చునా విశ్వదాభిరామ వినురవేమ
యనునట్లు ఇతరులు యథాశక్తికొలది భక్తి సల్పుచుండ

అది సహించక అదికాదిదికాదని మది చదరకొట్టెదరేగాని
ఏనదియేదియో తెల్పి మదిని నిలువబెట్టువారు అరుదు,

కం॥ నూటికి నొక్కరుభువిలో
కోటికినొక్కరును తత్వకోవిదులరయన్
పాటింపగ వాదములకు
కోటులుగల రేమిఫలము గురు తెరుగవలెన్॥

కం॥ కామము క్రోధము లోభము
బాములకిరువైన వైరిపద్ధతులరయన్
ధీమంతులు బరిమార్తురు
కామాదుల జూరగొనుము గట్టిగ జీవా॥

కం॥ జీవన్ముక్తి లభించును
కావున నేమరక తలపు గైకొనిదీనిన్
వావిరినొల్లనివారికి
దావలమగు మృత్యుభయము దవ్వగుసుఖముల్॥

శ్లో॥ గురు ప్రజ్ఞ ప్రసాదేనా। మూర్ఖోవా యది పండితః।
యస్తు సంబుధ్యతే తత్వం। విరక్తో భవ సాగరాత్తు॥

శ్లో॥ అక్రోధవైరాగ్యజితేంద్రియత్వం
క్షమాదయాసర్వజనప్రియత్వం।
నిర్లోభతా నిర్భయ శోకమోహం।
జ్ఞానస్య విహ్న దశ లక్షణాని॥

# కీర్తన

## పాటమల్లి సత్యనారాయణమ్మ.

రామనామ మిఠాయీ। ఇది రమ్యమైన మిఠాయీ। అహర్నిశంబులు ఆరగించినా అజీర్తిలేని మిఠాయీ। పంచాక్షర జిలేబీ। బలె పాకముగల జిలేబీ। పరమార్థంబను పాలతోడను పక్వమైనహల్వా ॥రా॥ రకారంబే బూందీ మకారంబే చీనా। ఆరక్షరముల బాండములోపల అమరియున్న మిఠాయీ ॥రా॥ ఆరంతస్థులకోటా। ఇది అందుకందనిబాటా। జ్ఞాననేత్రము కలిగినవారికి అల్లాబాడు త్రికోటా ॥రా॥ వజ్రములా పాత్రందూ। వైడూర్యమునిండదూ। నీలమాణిక్యము పచ్చలు బాపిన సునీలపాత్రమందూ ॥రా॥ నీటుగల్గు మిఠాయీ। ఇది ఎష్టశంకమాటోయీ। అద్వైతంబను దుకాణమందున అమ్మచుందు మిఠాయీ ॥రా॥ పావననామ మిఠాయీ। ఇది పాణికిదొరకదటోయీ। పాపలమధ్యను వెలుగుచుండిన పరంజ్యోతిమిఠాయీ ॥రా॥ విలువలేని మిఠాయీ। ఇది విరక్తుల కొంగునటోయీ। జ్ఞానధనంబూ నొసగినవారికి తూనికలేని మిఠాయీ ॥రా॥ కోటలోను మిఠాయీ ఇది కోటివెలుగులటోయీ। మనోనేత్రమూ లారగించెటి మహత్తైన మిఠాయీ ॥రా॥ రాజయోగులా బాటా। ఇది నవరత్నంబుల కోటా। కోటలోనుమిఠాయీ। ఇది తీగమెరుపు మిఠాయీ ॥రా॥ ధ్యానసమాధిమిఠాయీ। ఇది జన్మరహితమూహాయీ।

మూడవనమ్రంబె త్తినవారికి మోక్షమిచ్చుమిఠాయీ॥రా॥ భవ భయములులేవోయీ। ఇది బంధరహితము గదోయీ।జయా పజయములు విడిపించేటి జోగమాంబ మిఠాయీ ॥రా॥

సంపూర్ణం.

మిత్రులారా,

ఇదివరలో వేదాంతసారసంగ్రహమను గ్రంథము నందు రచియింపబడిన హాంశములు ఈదిగువ నుదహారింపబడి నవి. అవి యెవ్వియన ఆత్మపరమగు 8 కథలున్ను, 300 శ్లోకసామెతలకు ఆత్మపరమగు నర్థమున్ను, 100 పద్యములున్ను, గురునామము లష్టోత్తరమున్ను. 40 పాటలున్ను వ్రాయబడి యున్నవి వలయువారు ఈదిగువ వ్రాసిన ప్రకారం తెప్పించుకొనవచ్చును.

గౌడు జోగమాంబగారు,
రాధాకృష్ణ సమాజము, వేదాంత ఆఫీసు,
రవాణా యెలమంచిలి, విశాఖపట్నం జిల్లా.



మాస్టర్ మన్ ముద్రాశాల, కాకినాడ.



## శ్రీ గౌడు జోగమాంబగారిచే రచియింపబడినవి

| | | రు.అ |
|---|---|---|
| వేదాంతార్థసారభవప్రకాశిక | ... | 5-0 |
| భగవద్గీత 1, 2, 3 భాగములు (భాగము 1కి) | | 2-8- |
| వేదాంతసారసంగ్రహం | ... | 1-8- |
| ఆత్మపంచాంగం | ... | 1-0- |
| మహావాక్యతాత్పర్యసహితము | ... | 0-12- |
| ప్రణవగాయత్రి | ... | 0 12 |
| రామరహస్యార్థం | ... | 0-12- |
| శ్రీ సీతారామాంజనేయ ప్రశ్నోత్తరరూపంగా వ్రాయబడినది. | ... | 0-8. |
| ముక్తికాంతావిలాసము | ... | 0-6-0 |



వలయువారు :—

గౌడు జోగమాంబ
రాధాకృష్ణ ఆశ్రమం
యలమంచిలి, (విశాఖపట్నం జిల్లా)